వస్తున్నారు! వస్తున్నారు!





వధూవరులు
వస్తున్నారు!

విజయ
వారి

# పెళ్ళిచేసిచూడు






దర్శకుడు.... ప్రసాద్ • నిర్మాతలు..... నాగిరెడ్డి & చక్రపాణి

★ విశాలాంధ్రలో విజయఢంకా మ్రోగిస్తోంది ★

స్వార్థం జీర్ణించి, బీద గొప్పల
వ్యత్యాసాలతో కుళ్లిపోతున్న
నేటి ప్రపంచానికి
సర్వ మానవ సమానత్వం
—చాటు

వినోదా వారి

# శాంతి

చంద్రకుమారి.... సావిత్రి....సి. హేమలత
డా. గోవిందరాజుల సుబ్బారావు... రామచంద్ర కాశ్యప
ఆరణి... పేకేటి శివరాం...

కథ: కొప్పలి... పాటలు: సముద్రాల Jr... సంగీతం: సుబ్బరామన్... ఛాయ: రంగా... కళ: వాలి & గోడ్గాంకర్
దర్శకత్వం.. వేదాంతం రాఘవయ్య

పూర్ణా రిలీజ్

నిర్మాతలు... వినోదా పిక్చర్సు... మద్రాసు 17.

MATA

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు. 12-0-0
విడిప్రతిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
Founder : K. NAGESWARA RAO

సంపుటము 44
సంచిక 24
20-2-52

ఖర సంవత్సర మాఘ బహుళ నవమి బుధవారము


## విషయానుక్రమణిక 1952 ఫిబ్రవరి 20




లోటి నెం. 34.

గవర్నమెంటు రిజిష్టర్డ్ నరం నెం. 342.

# తత్త్వమసి

ముకుందరావు గడియారం ముళ్ళవంక చూస్తూ కూచున్నాడు. నిన్న న్యూస్ చెబుతున్నప్పుడొచ్చి వాచర్ సరిచేసిపోయినా మళ్ళీ తప్పుటైం చూపిస్తోంది గడియారం. అసలు సరైనటైం చూపించడం గడియారం బాధ్యత; కాని చూపించకపోవడం వస్తుతః దానితప్పు కాదంటోంది ముకుందరావు మనస్సు—

నలుగురి ఉపయోగానికీ కార్పొరేషన్ వాళ్లు టవర్ కట్టించి దానిమీద ప్రతిష్ఠ చేసిన గడియారం తప్పుడునడక నడవడం మంచిదికాదనిమాట వాస్తవమే. ఉబుసుపోకకువచ్చే జనంకోసం రేడియో ఎనిమిదిన్నరవరకూ మ్రోగుతూఉండాలి. అంతవరకూ వాచర్ అక్కడ ఉండితీరాలి. మొన్నొకరోజున తొందరపనిఉండి, మళ్లీ రావడానికి బద్ధకంవేసి వాచర్ గడియారం ముళ్లు అరగంటముందుకు తిప్పాడు. తనైతే, మొన్న చూశాడుగాని యిదివరకెన్నిసార్లలా జరిగిందో! వాచరే గడియారానికి తప్పుటైం చూపించడం నేర్పాడనిపించింది—

చిన్నప్పుడు చదువుకోడంకన్నా ఆడుకోవడమెక్కువ అవసరమనిపించేది ముకుందరావుకి. అయిదింటికిగాని బయటికి కదలడానికి వీల్లేదని దగ్గరుండి వాళ్ళమ్మ చదివించుతుంటే ఆటలమీద ధ్యాసతో చదివేవాడు. చదువుకుంటాడులేఅని ఆవిడ యేమరి ఉన్నప్పుడు ముకుందరావు కొన్నిసార్లు గడియారంముల్లు అనుకూలంగా త్రిప్పుకొని అయిదు కాకమునుపే జట్టుతో కలిసినరోజులున్నాయి. వాళ్ళనాన్న యింటికివచ్చినాక రిస్టువాచ్ చూసి 'వెధవ గడియారం' అని ఆవిడ గడియారాన్ని తిట్టేది. అది జ్ఞాపకమొచ్చింది ముకుందరావుకి—

'ముకుందం అలా చూస్తు కూచున్నావేరా? వేరుశనక్కాయలన్నీ అయిపోతున్నయి. చివరకు చెక్కుమిగుల్తుంది' అన్నాడు గోపాలం. ముకుందరావు ఓ కాయ ఒలిచి నోట్లోవేసుకున్నాడు. పార్కులోజనం అప్పుడే పలచబడుతున్నారు.

రేపు మళ్ళీ కంపోజిటర్లకు మేటరిచ్చుకోవాలి. రాసినకథ తనకు నచ్చలేదని మార్చమన్నాడు ఛీఫ్ఎడిటర్. ముకుందరావు శాంతిప్రియుడు కావడంతో ప్రతిదేశ సమస్యలోను అమెరికా జోక్యం కలిపించుకోడం అతనికిష్టంలేదు పైగా సైంటిస్టులు డబ్బుకోసం యాటంబాంబులు సృష్టించి యుద్ధాలకు తోడ్పడుతున్నారంటాడు. అనేవిషయాలు తీసుకొని అమెరికా పాలసీని ఖండిస్తూ కథరాశాడు. డైరక్టర్ల బోర్డులో ఎక్కువమంది అమెరికన్లు కావడంవల్ల ఆ కథ మార్చాల్సివచ్చింది. ఇక రాత్రికి కూచొని ఆపనిచేయాలి.

'గోపాలం, ఇహ మనమూ లేద్దాం' అన్నాడు ముకుందరావు. ఇద్దరూ బయల్దేరి శృంగాటకంవద్ద విడిపోయారు

అన్నం తిని రాయడంమొదలెట్టాడు. కళ్ళల్లోకి లైటు పొడుచుకుంటోంది, ఆర్పెయ్యండి అని నసుగుతూ భార్య పక్కన కూచొని 'రాసిందేరాస్తున్నా రెందుకూ' అని దీర్ఘంతీసింది. పత్రికవాళ్లు తనని నెలజీతానికి కొనుక్కున్నారు గనుక— ముకుందరావు జర్నలిస్టయినందుకు గోపాలం మురిసిపోతాడు. ముకుందరావు భార్యకూడా 'మావారు పత్రికలో పనిచేసున్నారు. కథలు బాగారాస్తారు'అని చెప్పుకుంటూ ఉంటుంది. ముకుందరావు చిన్నప్పట్నుంచీ కథలు రాయడంలో సరదాపడి చేయితిరిగిన రచయితయ్యాడు. అతనికదితప్ప యింకేం చేతకాదు. మొదటాక చోట గుమాస్తాగాచేరి చేతకాదనిపించుకొని బయటికి వచ్చాడు. గోపాలం పరపతితో యిప్పుడు ముకుందరావు తను పనిచేస్తున్న పత్రికలో కథాశాఖ ఎడిటరయ్యాడు.

సాయంత్రం పార్కులో కూచున్నప్పుడు నువ్వు మంచి 'ఆర్టిస్టు' వురా అన్నాడు గోపాలం. భాషమీదా భావాలమీదా ముకుందరావు కవాతుచెయ్యగలగడం ఎకౌంట్స్ అంకెల్లో మునిగిపోయే గోపాలానికి స్వేచ్ఛగల జీవనమనిపించింది. తనకు స్వేచ్ఛలేదనీ గుమస్తా జీవితం మహారోతఅనీ గోపాలం యేకరువుపెట్టాడు. తప్పుటైం చూపించడం నేర్చుకున్న గడియారంముళ్ళకేసి చూస్తూ ముకుందరావు ఊఁ కొట్టాడు. గోపాలం మాటలమధ్యలో 'డబ్బుకోసం ఒళ్ళమ్ముకున్నాన్రా? ఆ కుర్చీలో కూచొని కూచొని నడుం పీక్కుపోతోంది గాని మా హెడ్ వదిలిపెట్టడు' అన్నాడు. ప్రెస్‌లో కంపోజిటర్లుకూడా 'సత్తువ అమ్ముకుంటున్నా మండీ, నిల్చొని నిల్చొని కాళ్లుపీక్కుపోతాయి' అంటారు. ఇంకోళ్ళకోసం యాటంబాంబులు తయారుచేసే సైంటిస్టుకూడా 'నా విజ్ఞానం, అమ్ముకున్నాను, పరిశోధనలు చేసీ చేసీ మెదడు నీరసపడిపోతోంది' అనుకుంటాడేమో!" -

ఆలోచించి కథమారుస్తుంటే తనుకూడా ఆర్టును అమ్ముకుంటున్నట్లు ముకుందరావుకు తట్టింది. జర్నలిస్టంటే నలుగుర్ని సరైనమార్గంలో పెట్టే రచనలు చేస్తాడు గనుక అందరికంటే గొప్పవాడని గోపాలం అంటూంటే నిజమే ననుకుంటూ వచ్చిన

శ్రీ పి.యస్.ఆర్ ఆంజనేయశాస్త్రి

ముకుందరావు నీరసపడిపోయాడు. గుమాస్తాలాగా, కంపోజిటర్‌లాగా, యాటంబాంబులు చేసే సైంటిస్టులాగా తను కూడా తనచేతైనపనికి విలువకట్టి అమ్ముకుంటున్నాడు...

నీరసపుఘూటు తగ్గినాక మళ్లీ కలం పట్టాడు ముకుందరావు.

జీతపురాళ్లు రావడానికి కళను అమ్మకోక తప్పదు. అవి వస్తేనే డొక్కాడుతుంది. డొక్కాడితేనే తనలో కళ పుడుతుంది. పుట్టినకళను అమ్మితేనే జీతపురాళ్లొస్తాయి—ఇదొక విషస్ సర్కిల్.

ఉంకోపనిచేత కాక కళ ఒక వృత్తిగా మార్చుకున్న ముకుందరావుకు తనది కమ్మర్షియల్ ఆర్టయిపోయిందని బెరుకుపుట్టింది. కలం ఆగిపోయింది. తను బతకడంకోసం పత్రికకు నచ్చేకథలు రాయాలి. పూర్వకవులుకూడా నానారాజసందర్శనంచేసి అడ్డమైన పొగడ్తలూ పొగిడినవిషయం జ్ఞాపకంవచ్చి కమ్మర్షియల్ ఆర్టుకు తను ఆదిపురుషుడు కాకపోవడంవల్ల కొంత తేరుకున్నాడు. నలుగురికోసం రచనలు చేయాల్సిన ముకుందరావు తనకు జీతపురాళ్లిస్తున్న వారికోసమే రచనలు చేయాల్సిరావడంలో తనతప్పేమీ లేదనుకుంటూ కథపూర్తిచేశాడు.

నిన్న సరిచేసినా ఇవాళ మళ్ళీ తప్పుచూపడం వస్తుతః గడియారం తప్పు కాదంటోంది అతని మనస్సు.



వాచర్‌కోసం తప్పుటైంచూపిస్తున్న పార్కు గడియారంముల్లు అతని మెదడులో గిరగిరా తిరిగాయి.

ముకుందరావు లైటార్పి పడుకున్నాడు. మెదడు మసకపడడంతో నిద్ర రాలా. ఇష్టంలేని భావాలతో రచనలు చెయ్యడం ముకుందరావుకి జీతపురాళ్లిస్తున్న వాళ్లు నేర్పుతున్నారు. అలాగే కొన్నాళ్లు జరిగితే తనలో లేని భావాలను ఊహించుకొని నలుగుర్నీ దారితప్పించే రచనలు చెయ్యడం అతని కలవాటైపోతుంది. గుండె గుబుక్కుమంది ముకుందరావుకి. బతికే వాళ్ల తప్పులను బతికించేవాళ్లు బాధ్యులు. ఎంతకళను అమ్ముకున్నా తను రచయితే ననిపించింది ముకుందరావుకు. ఊహు... ముకుందరావు తప్పుచెయ్యడంలేదు—

ఆలోచిస్తూ పడుకున్న ముకుందరావుకు

(43-వ పేజీ చూడండి)

శెట్టి: ఏమిటీ చవటప్రశ్న ?

ముష్టి: నువ్వు పదిమందిని కన్నావంటే వదుగురు బీదపిల్లలకి తిండీ బట్టా లేకుండా చేసేవన్నమాట.

శెట్టి: ఆ మధ్య బీదవాళ్ళందరికీ చొక్కాలు కుట్టించి పంచిపెట్టేను.

ముష్టి: అవును. మళ్లీ ఐదేళ్ళకి మరోసారి పంచి పెడతావు, "మీ ఓటు నవకోటి నారాయణ శెట్టికే వేయండి" అని వాటిమీద రాయించి. ఏం ధర్మబుద్ధి!

(హేళనగా నవ్వుతూ మాయమౌతాడు)

శెట్టి: పొగరుబోతు వెధవ.

(పెద్దమనిషి ప్రవేశం)

శెట్టి: ఎవరు నువ్వు?

పెద్ద: అప్పుడే మరచిపోయేవూ?

శెట్టి. ఓహో నువ్వా!

పెద్ద: అవును

శెట్టి: మరో పది ఓట్లు నాకు వచ్చేయి కాదు. ఏంచేసి వుండేవాడ్నో.

పెద్ద: మరి నాలుగు మేడలు కట్టేవాడివి. ఇంతకీ, ఎలక్షనుకి ఏమాత్రం ఖర్చయింది?

శెటి: ఏభైవేలు

పెద్ద: అబ్బో! అయితే ఎందుకు ఓడిపోయేవు?

శెట్టి. నాదగ్గర లంచం తీసుకొని నన్ను మోసం చేసేరు కొంతమంది.

పెద్ద: డబ్బు లేక బాధపడుతున్న మంచివాళ్లు.

శెట్టి: మంచివాళ్లు కాదు. మోసగాళ్లు. పది ఓట్లతో నన్ను గెలిచేనని గర్వపడకు. మళ్ళీ వస్తుందిగా ఎలక్షను.

పెద్ద: ఏం చేస్తావు?

శెట్టి: మళ్ళీ నిల్చుంటాను. ఈసారి లక్ష రూపాయలు ఖర్చు పెడతాను. నీకు డిపాజిట్ కూడా దక్కకుండా చేస్తాను. నా పగ తీర్చుకొంటాను.

పెద్ద: మళ్ళా నిల్చుంటావూ?

(భయంకరంగా చూస్తూ మాయమై పోతాడు)

శెట్టి: వెధవ ఝడిపిస్తాడు. మరో పది ఓట్లు వచ్చేయి కాదు నాకు.

(4 వ పేజీ చూడండి)

# సుందరమ్మ మనసు

"ఆఁ! అదిగో... చెయ్యి వూపాడు. విడిక్కూడా పోయే కాలం దాపురించిందేమో!" అంటూ దభీలున తలుపు మూసికొంది, సుందరమ్మ. పల్లెటూరి సుందరమ్మ యీ విషయాన్ని మొదటినుంచీ కనిపెడ్తూనే వుంది. ఈ చేయి వూపే జాడ్యం వాళ్ళకు వొక వ్యసనంగా మారడం వలన సుందరమ్మ కూడా అటువైపు చూడ్డం ఒక జాడ్యంగానూ, తరువాత వ్యసనంగానూ, యిప్పుడు అలవాటుగానూ మారింది. ఇటువంటి విషయాలంటే సుందరమ్మకు అసహ్యం మాట అటుంచి భయం జాస్తి. అలాంటప్పుడు అటువైపు అసలు చూడకుండా వుంటే వాళ్ళెందుకు చేతులు వూపుతారన్న ఆలోచన సుందరమ్మకు లేకపోలేదు. అయినా, యీ సారి కూడా వాడు అలాగే తనను చూచి చేయి వూపుతాడా? అని ఒక చిన్న ప్రయోగం చేస్తున్నట్లు చూస్తూవుండేది. సుందరమ్మ యిక చూడగూడదు. అనుకొంటూనే చూస్తుండేది, వాళ్ళూ అప్పుడే చేయి వూపడం కూడా జరుగుతుండేది.

సుందరమ్మ కాపురానికి వచ్చి అప్పుడే నెలకి పైగా అయింది. ఇంట్లో వంట పని అంత పెద్దది గాక పోవడంవలన నాలుగు 'అత్తెసరు' మెతుకులు వండి అవతలపారేస్తే యిక ఆ నాటికి వంట పని పూర్తి అయ్యేది. మిగిలిన గంటలన్నీ గడపడానికి ఏ పని కల్పించుకొందామన్నా కనుపించేదిగాదు. 'ఇరుగిల్లూ, పొరుగిల్లూ' అంటూ వుంటే అక్కడ అమ్మలక్కలతో ఏవో నాలుగు కబుర్లు 'పిచ్చా-పాటీ'గా మాట్లాడుకొంటూ వుంటే యిట్టే కాలం గడచిపోతుంటుంది. ఇటువంటి అలవాటు సుందరమ్మకు చిన్నప్పట్నుంచీ వుండేది. సరిగ్గా తిన్న అన్నం మెతుకులు గొంతుకైనా దాటకుండా, పీట అయినా ఎత్తకుండా, కంచం అయినా కడక్కుండా, లంగాకి చేయీ, మూతీ తుడుచుకొంటూ వామన గుంటల పీట పుచ్చుకొనిగానీ, గచ్చకాయల డబ్బా పుచ్చుకొనిగానీ, చింతపిక్కల సంచి పుచ్చుకొనిగానీ, కోతి లాగా గంతులేసికొంటూ కన్ను త్రిప్పే లోపలే గడప దాటి పోయేది, ప్రక్క నున్న 'జట్టీ' వాళ్ళకోసం. పోనీ, పెద్దదయ్యాకైనా సుందరమ్మ కాళ్ళు కట్టుబడతాయనుకొంటే అబ్బే! అప్పటి అలవాట్లు అప్పటిలాగే లేకపోయినా, కొంచెం మార్పులతో పర్యవసానం మాత్రం అంతే వుంటుండేది. చందమామనుంచి సచిత్ర వారపత్రిక వరకూ పుస్తకాలు తిరగేయడం, ఆ కథల గురించి, రచనలు గురించి తోటి స్నేహితులలో తర్జన భర్జనలు చేయడం, నవల్సు చదవడం...సినిమా స్పీచ్‌లూ, నటనలూ, వారి దినచర్యల్లో, మాటల్లో, అభినయాలతో కూడా కన్పిస్తుండేవి. ఇక వాటికి అంతూ, దరీ, అంటూ వుండడం ఎప్పుడన్నా, ఎవరన్నా, ఓ తల మాసినా విడ నాలుగు చివాట్లు పెట్టి విదిలించుకొంటేనే వాళ్ళు లేవడం.

సుందరమ్మకి రైలు అంటేనే క్రొత్త. వాళ్ళ వూరికి ముప్పయి మైళ్ళ దూరంలో ఎటూ రైలు స్టేషన్ లేకపోవడం వలన రైలు అంటే ఒక పెద్ద భూతంలాగా వూహించే వాళ్ళు, ఆ వూరి వాళ్ళంతానూ. నూటికీ, కోటికీ యెవరన్నా రైలు చూసి వస్తే ఆ యింజనును అలాగే వర్ణించే వారు కూడాను ఓ పెద్ద భీకరాకారం అనీ, దానికి పెద్ద గొంతుక వుందనీ కూడా! సుందరమ్మ పుట్టి పెరిగిన తరువాతంతటికీ తన భర్తదగ్గరికి వచ్చేటప్పుడే రైలు యెక్కడం మొదటి సారి. అలాంటి సుందరమ్మ రైల్వే మాష్టరు పెళ్ళాం కావడం మొదట్లో భయం తరువాత విచిత్రంగానూ కనిపించినా యీ నెల్లాళ్ళల్లో ఆ యింజను కూతలకూ, బళ్ళ శబ్దాలకూ సుమారుగా అలవాటు పడింది.

సుందరమ్మకి ఆ రయిల్వే స్టేషన్ ఒక నరకం కంటే హీనంగా కనుపించింది ఆ రైలు వచ్చే వేళకు కళ్ళముందు నాలుగు యెడ్లబళ్ళూ, పాతిక మంది జనం అయినా కనుపెస్తారు ఆ బండి కాస్తా వెళ్ళిపోయాక ఒక పిట్ట కూడా వుండదు. పోనీ యిరుగమ్మా, పొరుగమ్మా వున్నారా! అంటే, దూరంగా వున్న రెండు రయిల్వే పోర్టర్ల యిళ్ళు తప్పితే అక్కడయినా ఏముంటయ్ అని. ఆ రోడ్ సైడ్ స్టేషన్‌లో యింజను కూతలూ...ఆ గొడవలే...ఆనందించినా, అఘోరించినా!

అంచేత సుందరమ్మ ఒక పుస్తకం చేత పట్టుకొని యింటిముందు వేపచెట్టు క్రింద కూర్చొని వచ్చే బండినీ, పోయే బండినీ చూస్తూ వుంటుంది. ఆనందరావు డ్యూటీ ఏడు గంటల వరకూ వుండడంవలన సుందరమ్మ అప్పటివరకూ అలా కూర్చోవడం అలవాటయిపోయింది. అలాంటప్పుడు ఆ యింజను డ్రైవర్లు ఆమె వైపే చేతులు వూపడం నిజానికి అంత సమంజసమైన పని కాదు. కోపం వచ్చి, వుక్రోషం కొద్దీ సుందరమ్మ వాళ్ళను ఏడ్పించడానికి తనూ చేయి వూపుదామనుకొంది. అలా తాను చేస్తే...అమ్మో! ఆ రయిల్వే సెక్షన్ అంతా యీ డ్రైవర్లు ఒక్కే 'పుకార్లు' లేపరూ! ఫలానా మాష్టరు పెళ్ళాం యిలా చేస్తుందని. అది తన మగడి చెవులు వరకూ వస్తే...కొరివితో తలగోక్కున్నట్టేగా!

సుందరమ్మ యీ విషయాన్ని ఒకరోజు ఆలోచించి వూరుకోలేదు. ప్రతి దినం వాళ్ళు చేతులు వూపడం యీవిడ చూస్తూ వుండడం జరుగుచుండేది. పోనీ, ఆయనతో చెపితే...ఇటువంటి విషయాలు అసలు మగవాళ్ళకు చెప్పవచ్చా? వాళ్ళూ, వాళ్ళూ తలలు పగలగొట్టుకోవడం ఆఫీసర్లకు రిపోర్టు చేసికోవడం.. అవన్నీ అలావుంచి చివరకు తనకే వక రిమార్కు వస్తుంది. 'నీవై చూడందే వాళ్ళలా ఎందుకు చేస్తారనీ.. అసలు ముందు నీవేం చేశావో'అనీ. ఈ విషయం సుందరమ్మకు బాగా తెలుసు. అందుచేత ఆనందరావుకి అసలు చెప్పనైనా చెప్పలేదు.

సుందరమ్మ పెద్ద అందగత్తె కూడా కాదు. అసలు తను అందగత్తెను కాదన్న విషయం సుందరమ్మకే బాగా తెలుసు. వీథి బళ్లో సుందరమ్మను 'గుడ్లగూబ'అనీ, లోయర్ క్లాసుల్లో 'కిరసనాయిలు డబ్బా'అనీ, అటు

శ్రీ పేరాబత్తుని ఈశ్వరరావు



ఇంజన్ డ్రైవరు చెయ్యి ఊపుతున్నాడు. తనుకూడా చెయ్యి ఊపితే? అమ్మో! అనుకుంది పల్లెటూరిసుందరమ్మ.

తిరువాత 'చింతపండు' అనీ...ఏవేవో నిక్‌నేమ్సు పెట్టి వెనుక భో...భో...లు కొట్టడం సుందరమ్మకు బాగా జ్ఞాపకం. పైన చెప్పిన నిక్‌నేమ్సులోని పోలికలు నిజానికి సుందరమ్మలో చాలా వున్నయ్. ఆ చిన్నారావుగాడు ముందు బెంచీలో కూర్చొని సుందరమ్మముఖం చూసినప్పుడల్లా రెండు చేతుల్తో ముఖం మూసికొని వాంతి వచ్చినట్లు నటించడం, 'సుందరమ్మ' అని 'రోల్ కాల్' పిలుస్తుంటే 'అబ్బో' "అపురూపసుందరి" అని వెక్కిరించడం... యివన్నీ ఆమె వినలేదు గనుకనా! అటువంటప్పుడు ఈ దౌర్భాగ్యపు వెధవలు తనను చూడగానే వాళ్ళు కొవ్వెక్కి గాక పోతే అలా చేతులు వూపడం దేనికి? "ఏమీ తెలియని సంగనాచుల్లాగా, యింజను మిషన్లమీద దృష్టిని నిలకడ చేసినట్లు నటిస్తూ ముఖం అటు త్రిప్పి... వట్టినే యిలా చేతులు వూపడం దేనికో! యీలాంటి తతంగాలు ఎవరికి తెలియవని" అని సుందరమ్మ అనుకొంటూ వుండేది.

ఆనందరావు పనిచేసే స్టేషనులో నీళ్ళు దొరకవు. అంచేత ప్రతి గూడ్సు బండికీ వాళ్ళు నీళ్లు పట్టుకొంటారు. సుందరమ్మకు పడి నీళ్లవడంచేత ఎంత తప్పించుకొన్నా రెండు బిందెలు నీళ్ళన్నా తెచ్చుకోవాలి—అంటే... ఒక్క సారయినా యింజను దగ్గరకు వెళ్లాలి.

రోజులు గడచిన కొద్దీ సుందరమ్మలో మార్పులు రావడం మొదలు పెట్టాయి. నిజానికి ఆమెకు ఎటువంటి దురభిప్రాయాలు లేకపోయినా భాస్కర్రావును చూస్తే ఆమెలో యేదో తెలియని ఒక విధమైన సంచలనం... ఆమె మనస్సును కలతపరుస్తుండేది. భాస్కర్రావు 207 నెంబరు యింజనులో వస్తూవుంటాడు. కండలు తిరిగిన దండలు, ఆజానుబాహుడు. విశాలమైన ఫాలభాగం, వుంగ్రాల జుట్టూ, యెంతటి మాసిపోయిన, బొగ్గు నూనెదుస్తులు వేసికొన్నా అతనిలో గల గాంభీర్యం, ఠీవి... ఒక విధమైన అందం—సుందరమ్మ మొదట్లో ఏమీ అనుకోకపోయినా రానురాను ఒక విధమైన అభిమానం అంటూ కల్గింది. అందరికీ మల్లే అతనూ, ఆమెను చూడగానే చేయి వూపుతాడు. అయితే ఆమెకు భాస్కర్రావు విషయంలో అసహ్యం లేదు. అంతే యిష్టమున్నదనీ గాదు. ఇష్టానికీ, అయిష్టానికీ మధ్యగల ఏదో తెలియని అవినాభావ సంబంధం వుండి వుండవచ్చు.

భాస్కర్రావు వచ్చేరోజు అంచనా వేసికొని సుందరమ్మ చక్కగా ముస్తాబై మరీ నీళ్లకు వెళ్తుంది. నీళ్ళు పట్టుకొనేటప్పుడు మాత్రం వాళ్లు ఏమీ మాట్లాడేవాళ్లు గాదు. "దూరంగా వుంటేనే యీ ఆర్భాటం అంతాను, చేతులూపడమూను...అంత దగ్గరగా వెళ్తే ముఖమైనా చూడ్డే!" అని మాత్రం మనసులో సుందరమ్మ బాధపడడం అక్షరాలా నిజం. అయితే భాస్కర్రావుకి తనంటే ప్రేమలేదా! దగ్గరగా వెళ్లాక ముఖమైనా చూడకుండా తన కేమీ పట్టనట్లు యింజను మెషిన్లు తుడుచుకొంటూ వుంటాడు—ఈ విషయంలో సుందరమ్మమనస్సులో యెంతో కష్ట పెట్టుకొనేది.

ఆరోజు 207 యింజను వస్తుంది. అంటే భాస్కర్రావు వస్తాడన్నమాట. సుందరమ్మ నీటుగా ముస్తాబయింది. బిందెలు రెండు మూడుసార్లు తళతళా మెరిసేటట్లు తోమింది. కట్టుకొన్న ముడిబట్టలో కూడా కొంత ప్రత్యేకప్రదర్శన చూపించాలనుకొంది.

సిగ్నలు యివ్వనూ యిచ్చారు. బండి రానూ వచ్చింది. ఈసారి ఏమైనా సరే భాస్కర్రావుతో మాట్లాడాలనుకొంది సుందరమ్మ. ఆరోజు భాస్కర్రావు స్వయంగా నీళ్లు వదిలాడు. సుందరమ్మ తల యెత్తి భాస్కర్రావు వంక ఒక్కసారి చూచింది. అతనిముఖంలో ఏవిధమైన భావ ప్రకటనా లేదు. విసిగి వేసారిన జీవితానికి అలవాటు పడిన వ్యక్తి ఆ యంత్రాలతో తానూ వొక 'యంత్రం' లా పని చేస్తున్నట్లు కనుపించాడు, భాస్కర్రావు. అయినా సుందరమ్మ శాయశక్తులా తన తీక్షణ వీక్షణాలను ప్రదర్శించినా పర్యవసానం ఏమీ కనుపించలేదు.

"వేడినీళ్లు యిస్తారా!" అని సుందరమ్మ అడిగింది. నిజానికి వేడినీళ్లు సుందరమ్మకు అవుసరం లేదు. ఎలాగైనా భాస్కర్రావుతో మాట్లాడా లనుకొంది సుందరమ్మ. అందుచేతే అడిగింది.

"అలాగే నమ్మా" అంటూ భాస్కర్రావు వేడినీళ్లను వదిలాడు, చన్నీళ్లను కట్టివేస్తూ.

ఈ మాటలు వినేసరికి సుందరమ్మ మనస్సు చివుక్కు మన్నది. ఆయన "అ..మ్మా" అంటా డేవిటి అనుకొంది. భాస్కర్రావు మాటల్లో అతని ప్రవర్తనలో తన కోసం అతను,, ఏ అణువైనా పరితపిస్తున్నట్లు కనుపించలేదు. మాట్లాడేటప్పుడు సుందరమ్మ వక్కైనా చూడలేదు.

బండి కదలింది. రోజూ యీపాటికే సుందరమ్మ యింట్లోకి వెళ్లిపోయేది. ఆవేళ మాత్రం అలాగే చూస్తూ నిలబడింది. కొంత దూరం బండి వెళ్లాక భాస్కర్రావు మామూలుగా మళ్లా చేయి వూపాడు, ఆమె వైపే చూస్తూ.

భాస్కర్రావు ప్రవర్తన సుందరమ్మకేమీ నచ్చలేదు. దగ్గరున్నంతసేపూ పల్లెత్తు మాట అయినా మాట్లాడని భాస్కర్రావు అంత దూరం వెళ్ళాక తనవైపే చేయి ఎందుకు వూపాలి? అతని దొక విచిత్ర ప్రవర్తన అనుకొంది. భాస్కర్రావు మీద జాలి, కోపం, ద్వేషం...ఒక్క సారిగా సుందరమ్మమనస్సులో కనుపించాయి. పంతానికి ఏమైనా సరే తానూ చేయి వూపాలనుకొంది. యిదే ఆఖరు ప్రయత్నంగా.

అప్రయత్నంగా సుందరమ్మ చేయి యెత్తేసరికల్లా గార్డుపెట్టె వచ్చేసింది. ఆ గార్డు వంక చూసేసరికి అతడూ అలాగే చేయి వూపుతున్నాడు, అయితే సుందరమ్మ వంక చూసి మాత్రం కాదు.

సుందరమ్మకు యిదేమీ అర్థం కాలేదు. భాస్కర్రావు చేయి వూపడానికి కారణం తాను వూహించుకొన్నది గాని యీ గార్డు యెందుకు వూపుతున్నదీ, అర్థం గాలేదు' అనుకోకుండానే యెత్తిన చేయి దింపుకొని వెనక్కి చూసేసరికి ఆనందరావు కూడా అలాగే స్టేషను ముందు నిలబడి నవ్వుతూ తన చేతిని వూపుతున్నాడు.

సుందరమ్మగుండె గతుక్కుమన్నది. ఇప్పుడు పూర్తిగా అర్థం అయిపోయింది. భాస్కర్రావు సుందరమ్మ వైపు చేయి వూపడం, తానూ చేయి యెత్తడానికి ప్రయత్నించడం— యివన్నీ చూచి, ఆ గార్డు వాళ్ళైనా, సుందరమ్మను పరిహసిస్తున్నారనుకొంది.

సుందరమ్మ భయపడి పోయింది. తన విషయం అందరికీ తెలిసిపోయినందుకు విచారం, తన భర్త కళ్ళారా చూచినందుకు భయం, ఆమెను వేధించేశాయి. సాయంత్రం తన భర్త వచ్చి తప్పకుండా అడుగుతాడు. తన జీవితంలో ఒక అగ్నిపరీక్షను ఎదుర్కోబోతున్నాననుకొంది.

ఆ పగలంతా సుందరమ్మ లోలోన చాలా భయపడిపోయింది. తలుపు దగ్గర ఏ మాత్రం శబ్దం వినిపించినా ఆనందరావు

[38-వ పేజీ చూడండి]

పెంచిన

# ప్రేమ

భగవాన్లు బావురమంటూ తల్లి కొంగు విడచి మేనత్తతో రైలెక్కాడు.

ఆరేళ్ల అజ్ఞానపు ప్రాయం. తల్లిని వదల లేని స్థితిలో ఇంకా, కిటికీలోంచి తల్లి కేసి, ఏడుస్తూనే బిత్తరి చూపులు చూస్తున్నాడు.

తల్లి ఏడుస్తూ 'వదినా కుర్రాడు, నీ కుర్రాడు గానీ, నా కుర్రాడు గాడు. వాడికో అక్షరం ముక్కొచ్చిందంటే,— నోటినుండి ఒక్క మాటనైనా వెలుపలికి రానీయలేదు వేదన. స్టేషన్లో అప్పుడే గంట కొట్టేశారు. గార్డు ఈలవేసి, పచ్చజండా ఊపేస్తున్నాడు. తన హయాంలో ఉన్న బండి ఇంకా కదలలేదనే కోపంవచ్చి గామాలు, క్రిందకుదిగాడు. నోట్లో ఈల-చేతిలో జండా ఏకబిగిని పనిచేసేస్తున్నయ్. తల్లిని విడచి కదలటాని కిష్టంలేని భగవాన్లులా, ఆఖరుసారి, 'భాం అంటూ గాడిద ఓండ్ర పెట్టినట్లు ఆఖరు కూత కూసి, భగవాన్లు దృష్టిని, తల్లినుండి వేరుచేసేస్తోంది బి. జి. ఆర్ ఇంజను.

కడుపు పొంగేలా ఏడ్చాడు భగవాన్లు.

మాతృ హృదయం కనుక, తన కుర్రాడు, తనని, విడిచిపెట్టి మాత్రమే యున్నాడు కానీ. నాలు గక్షరాలకోసం ఇప్పుడు విడువకపోతే, కలకాలం విచారించాల్సి యుంటుందని, ఆ ఏడుపులోనే, కాస్త ఊరట కల్గించుకొని, ఇంటిదారి పట్టింది భగవాన్లు తల్లి.

కడుపులోనుండి, సుభిల్లున పైకొచ్చే దుఃఖాన్ని ఆపుకోలేక, ఇంకా భగవాన్లు భావురుమంటూనే యున్నాడు. అప్పుడే పట్నం చేరటానికి మూడు స్టేషన్లు దాటేసింది రైలుబండి.

తన భావి జీవితమంతా, తానిప్పుడు ఏడుస్తూ వెళ్ళి చేయ్యబోయాల్సిన ఘనకార్యంపై ఆధార పడియుంటుందని పాపం, ఆ పసి హృదయానికేం తెల్సు!

'ఊరుకో నాయనా! ఊరుకోవూ! నీకు మంచిబట్టలు కొంటాను. డబ్బులిస్తాను. అక్కడ, హరీ, సీతా, ఇందూ, అంతా ఆడుకోటాని కున్నారు ఛా ఇట్లా ఏడుస్తే వాళ్ళు నవ్వరూ ? మళ్ళీ వారం రోజుల్లో అమ్మా, వాళ్ళూ వస్తారుగా! అని బుజ్జగించింది మేనత్త హనుమాయమ్మ.

* * *

పల్లెటూరి వాతావరణాని కనువైన చిన్ని హృదయానికి, పట్నవాసపు కృత్రిమపు సొంపులూ, వంపులూ, చిత్రమైన వస్తు సముదాయం—ఇంతకన్న మరోక లోకం లేదనిపించే విభ్రాంతి కల్గించింది భగవాన్లుకు

మాష్టారు, క్లాసు కుర్రాళ్లు, బెంచీలు, క్రమశిక్షణా, ఇంకా ఏమీ వారితో సన్నిహితుడు కాలేకపోతున్నాడు. వింత దృక్పథంలో కీడ్చుకెళ్లాయి భగవాన్లు దృష్టిని.

మాష్టారిచ్చిన పాఠాల్ని అప్పజెప్పేస్తున్నాడు

ఇంటికిచ్చిన లెక్కల్ని తప్పకుండా చేసేస్తున్నాడు.

* * *

శ్రీరాముడు దశరథుని కొడుకు, దశరథుడు అయోధ్యకు రాజు.

జుట్టు బెడ్ లైట్ చిమ్నీలో పడుతూంటే,

'గుడ్డి వెధవా! కాస్త ఎడంగా కూర్చోవాలి గానీ, తీరా నేచూడకపోతే కాలి చచ్చినంత కల గాద్దువు.'

ఒక్కటే ఒక్క పిడుగులాంటి కేక వంటింట్లో నుంచి వచ్చే సరికి హఠాత్తుగా ఆపేశాడు.

కోర్టులో నేరస్థుడిలా, పుస్తకాన్ని కావలించుకొని బిత్తరి చూపులు చూస్తున్నాడు.

'ఊ! కానీ, చూస్తావేం? చదూ!' కేకేసింది.

'చేసిన పొరపాటు అర్థం కాలేదు.' కుర్రాడికి.

కౌసల్యా, సుమిత్రా, కైకేయి అను ముగ్గురు భార్యలు కలరు, అందులో పెద్ద భార్య కౌసల్య.

'గుంట చచ్చినాడికి తెలిసేడుస్తేగా! నేజెప్పేది. అరే వెధవా! రేపు తెల్లారితే ఆ నర్సింహులు గాడితో చెప్పి ఆ చుంపుర్లు కాసిన్ని కత్తిరింపించక పోతే, నాకు మాట

[37-వ పేజీ చూడండి]

## శ్రీ దేశరాజు శేషగిరిరావు

# చిన్నాడు

చిన్నాడిగురించి కమల అంతగా వ్యధ పొందటానికి, బెంగపెట్టుకోవటానికి, కృంగిపోవటానికి తగిన కారణం లేకపోలేదు. ఆ వ్యధలో రామం కూడా వంతుదారుడేయైనా కమల పొందుతున్న వ్యధ తను పొందటము లేదు. అలా పొందలేకపోవటానికి కారణం — రామంకి చిన్నాడిమీద ప్రేమ లేకపోవటం కాదు. తనుకూడ గుండె జారవిడిస్తే అసలే కృంగిపోతున్న కమల యింకా అధైర్యపడి కృశించిపోతుందేమో నన్న భయంచేత తన గుండె దిట్టపరుచుకోవలసి వచ్చింది.

లేక లేక పుట్టిన ఒక్క నలుసును మొదటినుండి మంచి వాతావరణం, పరిసరం కల్పించి ఉత్తమ ఆదర్శాలు, సంస్కరణ భావాలు నూరిపోసి ఆదర్శపౌరునిగా తయారుచేదామని పెంచుతూ వచ్చిన చిన్నాడి పరిస్థితి అలా తారుమారు అవుతుందని వాళ్ళెప్పుడూ ఊహించలేదు. ఎప్పుడన్నా కమల కాస్త ఎక్కువ గోము చూపిస్తే దానివలన తరువాత పరిణమించపోయే పరిస్థితులను బోధపరిచి తన మార్గానికి త్రిప్పుకునేవాడు రామం. కమలకూడా చిన్నాడి శ్రేయస్సుని, అభివృద్ధిని, అభిలషించేదే కాబట్టి చిన్నాడి విషయంలో రామం భావాలతోనే ఏకీభవించేది.

వాళ్ళ భావాలు, ఆదర్శాలు ఉత్తమమైనవే అయినా వాళ్ళు ఆచరిస్తున్న మార్గం వాళ్ళకి - ముఖ్యంగా రామంకి- మంచిగా కనిపించినా ఆ ఆదర్శాలను గుడ్డిగా ఆచరిస్తున్నారనే సంగతి తెలుసుకోలేక విషమపరిస్థితులను ఎదుర్కోవలసివచ్చింది. చిన్నాడిసంగతి అలా తారుమారు కావటానికి, వాళ్లు "మంచి" అనుకొనే ఆ ఉత్తమ ఆదర్శాలను గ్రుడ్డిగా ఆచరించటమే కారణమైంది.

నానాటికి చిక్కిపోతున్న కమలను చూచి, చిన్నాడిధ్యాసే మనస్సులో పెట్టుకుని బాధపడుతుందని, ఆ సమస్యా పరిష్కార మార్గాలు ఆలోచిస్తున్న రామంకి అసలు విషయం తెలియదు. కమల చిక్కిపోవటానికి కారణం చిన్నాడి విషయం పూర్తిగా కాకపోయినా ఆ వాంతులు, ఆ అన్నం సహించకపోవటం, బట్టి తను చూచాయగా గ్రహించగలిగాడు. తరువాత కమలనోటంబడి ఆ మాటకూడ సిగ్గుతో చెప్పగా విన్నాడు. రామం చాలా సంతోషించాడు. అలా సంతోషించటానికి కారణం తను మరొక పాపకి తండ్రి కాబోతున్నాడని కాదు. ఇప్పుడైనా కమల చిన్నాడివిషయం మరవటానికి అవకాశం కలుగుతుందని ఊహించినట్టే తనకు పుట్టబోయే బుల్లిబుజ్జాయిగురించి గాలిమేడలు కట్టుకుంటూ గతించిన విషయం విస్మరించి, తన ఆరోగ్యాన్ని కోలుకొంటూంది కమల. ఇకముందైనా తన ఆదర్శాలను గ్రుడ్డిగా ఆచరించకుండా మెలకువతో ప్రవర్తించటానికి తగిన కట్టుబాట్లు చేసుకుంటున్నాడు రామం. వేవిళ్ళు పడుతూన్న కమలను చూడటానికి వచ్చిన వాళ్ళమ్మ నాన్నను చూచి, చిన్నాడిని జ్ఞప్తికి తెచ్చుకుని కళ్ళంబడి నీళ్లు త్రిప్పుకుంది. "జరిగిందేదో జరిగిపోయింది, యింకట్టే బాధపడకమ్మా" అని ఓదార్చారు. అయిదు సంవత్సరాల చిన్నాడు కమల రామంల హృదయాలలో మరపుకురాని వ్యక్తిగా, తలచుకున్నప్పుడల్లా కన్నీటిచుక్కలను సానుభూతిగా పొందగలిగేడు. వాళ్ళకొక ఆదర్శాన్ని బోధపరిచేడు. అంతే.

* * * *

పిల్లల్ని పెంచాల్సిన బాధ్యత తల్లిదండ్రులమీద పడేసరికి ఆ బాధ్యతను సక్రమంగా నిర్వహించటానికి కొన్ని ఆదర్శాలను పాటిద్దామనుకుంటారు. పిల్లల్ని శారీరకంగా, మానసికంగా తమకన్నా ఓమెట్టు పైకెక్కిద్దామనే నిర్ణయం మనస్సులో జరుగుతుంది. కాని ఆ ఆదర్శాలు, నిర్ణయాలు ఆచరణలోకొచ్చేసరికి అవి వికృత రూపాలు ధరిస్తూండటము సహజం. తమ చిన్నాడిని సర్వవిధాల సుగుణవంతునిగా తయారుచేదామనుకున్నారు.

చిన్నాడిని కూపస్థ మండూకంగా ఉంచేకంటే ఊరిలో వింతలు, విశేషాలు చూపించి వాటిగురించి కొంత విజ్ఞానం అతనిలో కలుగచేదామనే తలంపుతో ఆనాడు చిన్నాడితోపాటు పార్కుకి బయలుదేరాడు రామం. రోడ్డుమీద దుకాణాలు, రంగులబట్టలు, తనకు కనిపించే, వినిపించే రంగులు, శబ్దాలగురించి ప్రశ్నలు వేస్తున్నాడు, చిన్నాడు. అటువంటి సమయంలో అతని ఆసక్తిని అణచివేయకుండా ఆ విషయాలనుగురించి కొంత అనుభవం కలుగజేస్తే అవి చిరకాలం జ్ఞాపకముండటానికి అవకాశముంటుందనే వుద్దేశంతో, విసుక్కోకుండా ప్రతీదానికి సమాధానా లిస్తున్నాడు.

కాస్సేపటికి పార్కు చేరుకున్నారు. రామం పేపరు చదువుకొంటూ ఓ అరుగు పైని కూర్చున్నాడు. చిన్నాడు వింతగా వినిపిస్తున్న రేడియోధ్వని ఎక్కడినుంచి వస్తుందో చూదామని తల త్రిప్పాడు.

ప్రక్కనేవున్న ఎర్రమందారపువ్వులు చిన్నాడి అవధానాన్ని ఆకర్షించాయి. తప్పొప్పు విచక్షణా జ్ఞానంలేని చిన్నాడు పువ్వుకోసి "నాన్నా పువ్వు" అంటూ రామం చదువుకు ఆటంకం కలిగించేడు. చిన్నాడు చేసింది తప్పు పనే ఐనా అప్పట్లో వాడిని మెచ్చుకోపోతే బాధ పడతాడని "బావుందిరా" అనేసి వెంటనే అటువంటి తప్పు పనులు చేయటానికి తావీయకూడదని నిశ్చయించి "అలా దొంగతనంగా కోయకూడదు. అది ఎవరిదైతే వారినడిగి కోయాలి" అని కొంచెం మందలించాడు. చిన్నాడు మళ్ళీ పోయి కాస్సేపు గడ్డిలో ఆడుకుని బాగా అలిసి, చమటతో వచ్చి యింటికి పోదామన్నాడు. బాగా చీకటి పడటంమూలాన్ని యింటికి బయలుదేరారు. గంటస్తంభం దగ్గరకు పోయేసరికి రంగురంగుల విద్యుద్దీపాలు, సోడాబుడ్లు, గంటస్తంభం యివన్నీ చిన్నాడిలో కౌతుక సహజాతి లక్షణా జ్ఞప్తికి వచ్చారు. తన చిన్నాడు అలా తిండిపోతుగా మారకూడదనే నిశ్చయం తనలో కలిగింది. అది మిఠాయి అని అప్పట్లో చెప్పి, యిచ్చి, రుచిమాపిస్తే ప్రతీ రోజూ అదే కావాలంటాడు. తెచ్చి యివ్వకపోతే మారాం చేస్తాడు. తెచ్చిస్తే జబ్బులపాలవుతాడు. చిరుతిళ్లు అబ్బుతాయి. అలా "కాకుండా అది మందు నాన్నా" అన్నాడు.

"ఎవరికి నాన్నా?"

"దేవుడికి"

"నాకీయవూ?"

"తప్పుబాబూ! మనం తినకూడదు"

"తింటే ఏంనాన్నా?"

"చచ్చిపోతారు"

"మరి దేముడు చచ్చిపోడా నాన్నా?"

"ఊహుఁ—దేముడు చచ్చిపోడు దేముడికి ముసలితనం లేదు. దేముడికి చావు పుట్టుకలు లేవు. దేవుడికి జబ్బులు రావు. దేముడు సర్వాంతర్యామి." ఇలా ఏదో

"బాగానే వుంది. మీరు తిందామనే తెచ్చుకున్నారాయేం?"

"మరి దేముడు తింటాడనే తెచ్చాననుకున్నావా?"

"ఏమైనా అనండి, యిప్పుడు నేనివ్వదలచుకోలేను. ఉదయాన చిన్నాడికిద్దామని దాచేను."

"అదిగో చిన్నాడికే! ఆడవాళ్లంతా పిల్లల్ని పెంచటంలో యిటువంటి చోట్లోనే తప్పుదారి త్రొక్కుతారు. పిల్లలమీద ప్రేమకొద్దీ, వారు కోరిందిచ్చి, చిరుతిళ్లకు అలవాటు చేసి, రోగాల పాలుచేసి, తిండిపోతులుగా తయారుచేస్తారు. వారు కోరిందిచ్చేయటమే ముద్దనుకుంటారు. అలా పెట్టటంవలన వచ్చే విపరీతాలను ఆలోచించరు."

"ఓస్! ఆ మాత్రానికే."

"ఆమాత్రమే నేమిటి. అదే మనకొంప తీస్తుంది."

"అయినా చూస్తూ, చూస్తూ యింట్లో

**శ్రీ డొంకిన వెంకటరమణమూర్తి**

లను రేకెత్తించి ప్రశ్నల ద్వారా బయటికి వస్తున్నయి. రామం మామూలు ప్రకారం సమాధానం చెప్తున్నాడు. ఓ మిఠాయి దుకాణం ముందు ఆగారు. డబ్బులిచ్చి మిఠాయి యిమ్మన్నాడు రామం. వెంటనే చిన్నాడి ప్రశ్న "అదేంట"ని.

వెంటనే రామం ఆదర్శాలన్నీ తన కళ్ళ ముందు మెరిశాయి. ఎంతోమంది పిల్లలు చిరుతిళ్లకు అలవాటుపడి అజీర్తి, బల్ల వ్యాధులతో బాధపడుతున్నవాళ్లు తన కళ్లముందు ప్రతిబింబించారు. వాళ్ళలా తన చిన్నాడు తయారు కాకుండా మంచి ఆరోగ్యవంతునిగా తయారు చేదామనే వాంఛ కలిగింది. ఎంతోమంది పిల్లలు తల్లిదండ్రుల కట్టుబాట్లు లేకుండా వీధులంబడి ధూళి, దూసరాళ్ళతో నిండివున్న చిరుతిళ్లు కొనుక్కొని వీధులలోనే అసహ్యంగా తింటూ రోగాలపాలవుతున్న పిల్లల్ని తను చూస్తున్నాడు. తన చిన్నాడికి అటువంటి చెడు అలవాట్లు అబ్బకుండా చేదామని ఆశించాడు. ఎంతోమంది పిల్లలు కేవలం చిరుతిళ్లకు అలవాటుపడి పెద్దవాళ్ళైనా కూడా ఆ దురలవాట్లను దూరం చేసుకోలేక సంఘంలో "తిండిపోతులు" అనే చెడుపేరు తెచ్చుకున్నవారు తనకు దేముడిగురించి చిన్నాడి ఊహకు అందకుండా చెప్పుకుపోతున్నాడు.

చిన్నాడికి, దేముడి జరామరణాల విషయం అట్టే తల కెక్కకపోయినా, మందువిషయం బాగా తలకెక్కిపోయింది. మందు అంటే అదొక ప్రాణహాని కలిగించే పదార్థమనుకున్నాడు. ఈ విషయంలో విపరీత ప్రశ్నలు చెలరేగకుండా రామూ సంభాషణ మార్చేసి చిన్నాడిని యింటికి తీసుకుపోయాడు.

*   *   *

రాత్రి తొమ్మిది గంటలైంది. వాకిట్లో మంచంమీద వెల్లికిలా పడుకుని వినీలాకాశంలో, పండు వెన్నెల్లో, నల్లమేఘాల వెండిపు పరుగుల నవలోకిస్తున్నాడు రామం. ఇంట్లో సామాన్ల సర్దుబాటు చప్పుడు ముగిసింది. గడులు వేస్తున్న చప్పుడు పూర్తైంది. గాజులచప్పుడు దగ్గరైంది. సంపెంగపూల వాసన గుఫ్‌మంది. కమల మంచంమీద కూచొని చెక్కయిస్తూ, తమలపాకులకి సున్నం రాసి యిస్తోంది.

చెక్క నోట్లో వేసుకుంటూ "చిన్నాడు పడుకున్నాడా" అని అడిగాడు రామం.

ఆఁ—

"అయితే యిందాక దేముడిదగ్గర పెట్టిన మిఠాయి తీసుకురా. రుచి చూద్దాం."

కుర్రాడికి పెట్టకుండా తినేయటానికి మనస్సెల్లా వప్పుతుందండీ?"

"అదికాదు, కమలా! ఈవేళ ఒక్క రోజేగదా అని యిచ్చామంటే, యిక ప్రతిరోజూ అదే కావాలంటాడు. అసలే వాడిది కఫశరీరమా? దానికితోడు తీపి వస్తువులు యిచ్చామంటే, యింకేమన్నా

వుందీ? అంతేగాని నాకుమాత్రం ప్రేమ లేదనుకున్నావా?

"అదెవరన్నారు?"

"కాకపోతే మరేంటి? మనం అనుకునే చెప్పాము, అలాంటి వస్తువులు మందని, అవి తినకూడదని, తింటే చచ్చిపోతారని. ఈ వేళ అదే వస్తువు వాడికిచ్చి ఫరవా లేదని ఋజువుచేస్తే యింక మనం వాడిని మభ్యపరచగలమా?"

"సరే లెండి, నా కెందుకొచ్చిన గొడవ. మీయిష్టం వచ్చినట్టే కానియ్యండి" అంటూ మిఠాయి తెచ్చియిచ్చేసింది.

రామం నిశ్చింతగా తినేసినా, కమల మాత్రం ముట్టుకోలేదు.

*　　*　　*

రామం ఆఫీసునుండి వచ్చి కాళ్లు, చేతులు కడుగుకొని వాలుకుర్చీలో కూర్చొని పేపరు చూస్తున్నాడు. కమల కాఫీ తెచ్చి పెట్టింది. కాఫీ పుచ్చుకొంటూ "చిన్నాడింకా బడినుంచి రాలేదూ?" అని అడిగాడు.

"ఈవేళ వాళ్ళ బడిలో ఏదో గారడీ వుందని మధ్యాహ్నం అజా అడిగి తీసుకు వెళ్లాడు. రావటం కొంచెం ఆలస్యం అవుతుందేమో" అని సమాధానం చెప్పేలోగా చిన్నాడు పరుగెత్తుకుంటూ వచ్చి సంచి రామం కిచ్చేసి కమల వడిలో కూలబడ్డాడు. తను గారడీలో చూచిన వింతలన్నీ ఏకరువు పెట్టడం ఆరంభించాడు.

"నాన్నా గారడీవాడు ఖాళీగ్లాసు చూపించి అరటిపండు తీశాడు నాన్నా. ఆ వేళ నీవు మందని చెప్పావే అది మా మాస్టారు కిచ్చేడు నాన్నా" అని యింకా ఏవేవో ఏకరువు పెడుతున్నాడు.

"కమలా! వీడిని లోపలికి తీసుకువెళ్లి ముఖం కడిగి మంచిబట్టలువేసి తీసుకురా. పార్కుకి వెళతాం" అన్నాడు.

చిన్నాడితోపాటు కమల లోపలికి వెళ్లి చిన్నాడి కమీజు తీసి వంటిమీద చెయివేసి తీసుకు వెళ్తోంది. వళ్లు వేడిగా తగిలింది. చప్పున నుదుటిమీద చేయివేసి చూచింది. చాలా వేడిగా ఉన్నట్టు తోచింది. చేతనున్న కమీజాతో కంగారుగా చిన్నాడిని రామందగ్గరికి తీసుకు వెళ్లి "చిన్నాడికి జ్వరం తగిలినట్టుంది చూడండి" అంది. "ఏదీ యిలారా నాన్నా!" అంటూ దగ్గరగా తీసుకుని వంటిమీద చేయివేసి చూచాడు. "జ్వరం తగిలినట్టే వుంది. ఈ రాత్రి వాడికి అన్నం పెట్టకు. కాఫీ యివ్వు. నే నలా పార్కుకి వెళ్లి వస్తాను." "డాక్టరుదగ్గరకు తీసుకెడితే బాగుంటుందేమో?" "ఈ మాత్రం దానికే డాక్టరెందుకు? ఏదో వేడిచేసి వచ్చుంటుంది. ఈ పూట లంఖణంచేస్తే రేపదే తగ్గిపోతుంది" అని చెప్పి పార్కుకి బయలుదేరాడు.

కమల చిన్నాడితో యింటిలోకి వెళ్లింది. వంటింటిలో చిన్నాడు కమల ప్రక్కనే కూర్చొని గారడీ కబుర్లు చెప్తున్నాడు. కమల క్షణక్షణానికి చిన్నాడివంటిమీద చేయివేసి చూసుకుంటూంది. చిన్నాడికి నీరసం హెచ్చినట్లైంది. చిన్నాడి మాటల్లో చురుకుదనం తగ్గింది. నిద్ర వస్తోంది అన్నాడు. కమలకుమాత్రం నిశ్చయమైంది జ్వరం హెచ్చిందని. చేతుల్లో పని విడిచిపెట్టి పక్క వేసి చిన్నాడికి నిద్రపట్టేవరకూ కూర్చొని, తర్వాత వంట ప్రయత్నం చేసింది.

రామం పార్కు నుండి వచ్చేసరికి చిన్నాడి జ్వరంగురించి చెప్పి డాక్టరును తీసుకురమ్మంది గాభరాగా. రామం చిన్నాడి ప్రక్కలో కూర్చొని చిన్నాడి వంటిమీద చేయివేసి "అంత గాభరా ఎందుకు అదే తగ్గిపోతుందిలే. అంతగా అవసరమైతే ఉదయమే డాక్టరును తీసుకువద్దాం" అన్నాడు.

"కాఫీ యిచ్చేవా?"

"లేదు."

"కాఫీ చేసి ఫ్లాస్కులో వుంచు. కాస్సేపటిలో జ్వరం తీవ్రత తగ్గుతుంది. తెలివి రాగానే యిద్దాం. నాకు వడ్డన చేయి." అంటూ తన గదిలోనికి పోయాడు.

భోజనం చేసివచ్చి "నీవు వెళ్ళి భోంచేయి, నేను చిన్నాడి దగ్గర కూర్చుంటాను."

"నాకేం ఆకలిగా లేదండీ"

"ఈ మాత్రం దానికే బెంగ పెట్టుకుంటే ఎలా చెప్పు? నా మాట విని వెళ్ళి భోజనం చేయి."

రామం మాటలు కాదనలేక వంటింటిలోకెళ్ళిందేగాని, ఏమి పెట్టుకుందో, ఏమి తిన్నదో తనకే తెలియని పరిస్థితి యేర్పడింది. ఏదో రెండు మెతుకులు ఎంగిలి పడి యివతలికి వచ్చేసింది.

రాత్రి పదైంది. చిన్నాడికి కొంచెం తెలివి వచ్చినట్లైంది. కళ్ళు విప్పి ఎవరి కోసమో ఎదురుచూస్తున్నాడు. రామం అడిగాడు "ఏం కావాలి నాన్నా!" అని. "అమ్మ" అన్నాడు నీరసంగా. ప్రక్కనే వున్న కమల "ఏంబాబూ!" అంది. "ఆకలిగావుందే అన్నం పెట్టవూ?" "జ్వరంగా వుంది అన్నం తినకూడదు. కాఫీ త్రాగితే తగ్గిపోతుంది. రేపు జ్వరం తగ్గిపోతే అన్నం తిందువుగానీ." అని నచ్చచెప్పాడు రామం. కమల ఫ్లాస్కులో కాఫీ గ్లాసులో పోసియిచ్చింది. కాఫీ త్రాగి చిన్నాడు పడుకున్నాడు. ప్రక్కనే కమల పడుకొంది. వాలు కుర్చీ వేసుకుని రామం ఏదో పుస్తకం చూస్తున్నాడు. కమలకు పరి పరి విధాల ఆలోచనలు పరుగిడుతున్నాయి. తెల్లారేసరికి చిన్నాడికి జ్వరం తగ్గుతుందో లేదో...

తగ్గకుంటే డాక్టరుని తీసుకువస్తే బాగుంటుందేమో... కానీ డాక్టరుని తీసుకురావటం గురించి చిన్న అనుమానం అడ్డం తగిలింది. ఊరిలో మసూచిమాడావుడి మూలాన్ని మూడురోజులు చూచిన తర్వాత డాక్టరుని తీసుకువస్తే బాగుంటుందేమో అనుకుంది. ఇంతలో చిన్నాడి మూలుగు వినపడింది. ఆలోచనలన్నీ ఒక్కసారి ఆగిపోయాయి. రామం చదువుతూన్న పుస్తకం మూసి వెనకకు తిరిగి చిన్నాడి వంక చూస్తున్నాడు.

"నాన్నా గారడీవాడు...గోపిగాడు ఉంగరం దాచేశారు నాన్నా. అది మేష్టారుగారి జేబులో కెళ్ళింది నాన్నా.. ఒరే రంగా! నాపలక పగలగొట్టేవు కదూ ! మానాన్నతో చెప్తానుండు." అని ఏమేమో పలవరిస్తున్నాడు.

చిన్నాడివళ్లు అగ్నిగుండం అయిపోతూంది. కళ్లు చింతనిప్పుల్లా గున్నాయి. స్మారకం లేకుండా పడివున్నాడు. జ్వరం తీవ్రత హెచ్చింది. కమల అలా కళ్లప్పగించి చిన్నాడిని చూస్తూంది. తనకు తెలియకుండా రెండు కన్నీటి చుక్కలు రాలేయి. ఆవేదన అధికమైంది. ఆందోళన అంచులు దాటింది.

మాతృహృదయం తల్లడిల్లిపోయింది. "చిన్నా!......" అంటూ కేకింది. చిన్నాడు కొంచెమైనా చలించలేదు. అంతవరకూ చలించని రామం చిన్నాడి స్థితికి ఆందోళనపడ్డాడు. అతని హృదయం కూడ బింకం తప్పింది. ఏమి చెయ్యడానికి కాళ్లు చేతులు ఆడని పరిస్థితి యేర్పడింది. ఇద్దరూ చిన్నాడికి చెరో ప్రక్క కూర్చున్నారు. డాక్టరుని తీసుకురమ్మని కమల రామంని తొందరపెట్టింది. రామం నిర్జీవ ప్రతిమలా వెళ్లి డాక్టర్ని పిలుచుకు వచ్చేడు. డాక్టరు చిన్నాడిని చూస్తున్నంతసేపూ కమల డాక్టరు ముఖకవళికలను గమనిస్తోంది. డాక్టరు ఏమి చెప్తాడా అని చెవులు విడిచిపెట్టాడు రామం. డాక్టరు కమల పొందుతూన్న భయాన్ని గమనించి "ఏం ఫర్వాలేదు. తగ్గిపోతుంది. ఇంజక్షను యిస్తాను" అని చెప్పి యింజక్షనిచ్చాడు. డాక్టరుతోపాటు రామం బయటికి నడిచేడు, వాళ్లు బయటికి నడవగానే కమల చిన్నాడిప్రక్క సుడిగాలిలా వాలింది. డాక్టరు వీధిలో రామంతో "అబ్బాయి పరిస్థితి చాలా ప్రమాదస్థితిలో వుంది. మీరు కాస్త కనిపెట్టి మెలకువతో చూస్తుండాలి. ఆస్పత్రికివస్తే మందు, మాత్రలు యిస్తాను" అని హేండ్ బేగ్ పుచ్చుకొని వెళ్లాడు. రామం లోపలికి రాగానే "డాక్టరు ఏమన్నారు ?" అని అడిగిందాతృతగా కమల. "ఫర్వాలేదన్నారు." అన్నాడు గంభీరంగా.

"చిన్నాడిని జాగ్రత్తగా చూస్తూండు" అని చెప్పి డాక్టరుదగ్గరకు పోయాడు. డాక్టరు మందులిస్తూ, వాడే విధానం చెప్పాడు. రామం రాకకోసం గుమ్మంలో ఎదురు చూస్తోన్న కమల రామం చేతులో మందుసీసా తీసుకుని లోపలికి వెళ్లింది. చిన్నాడి నోటిలో మందుపోశారు.

చిన్నాడు ఆ మతిలేని పరిస్థితిలో ఆ

మందు త్రాగేశాడు. చిన్నాడి కదలికలకోసం ఎదురు చూస్తున్నారు. జ్వరం తీవ్రత తగ్గినట్టేమీ కనిపించలేదు. ఆ రెండు హృదయాలు భయం, ఆవేదన, ఆందోళనలతో తల్లడిల్లి పోతున్నయి. చిన్నాడిని మధ్య పెట్టుకుని ఆ రాత్రంతా రెప్ప వాల్చలేదు. మరి మూడు గంటలు దాటిన తర్వాత, మళ్ళీ చిన్నాడి నోటిలో మందు పోశారు. తెల్లవారింది. డాక్టరు యిచ్చిన యింజక్షను ఆ రెండు మోతాదుల మందు చిన్నాడి పరిస్థితిని ప్రమాదావస్థనుండి తప్పించగలిగేయి. చిన్నాడి శరీరం కొంచెం చల్లబడింది. కళ్ళు విప్పాడు. "అమ్మా!" అన్నాడు నీరసంగా. "ఏం నాన్నా?" అంది ప్రక్కనే ఉన్న కమల. "ఆకలవుతూందే?" అన్నాడు. రామం వైపు చూచింది కమల. "మందువేళైంది, మందిచ్చితర్వాత కాఫీ యిద్దాం" అన్నాడు రామం.

"మందు" మాట విన్నాడు. గట్టిగా అరిచాడు. "నాకు మందు వద్దు. నేను మందు తినను. మందు తింటే చచ్చిపోతాను" అన్నాడు. ఆ పసిహృదయానికి యేర్పడ్డ పూర్వపు అభిప్రాయాన్ని పురస్కరించుకుని. రామంకి వళ్ళంతా ముచ్చెమటలు పోసినయి. తను ఆశించిన ఆదర్శం యిలా తారుమారవుతుందనుకోలేదు. ఇప్పుడు తనేం చేయాలి? తనకేమీ తోచలేదు. మళ్ళీ మందు నోటికందించాడు.

"ఉహుఁ నేను త్రాగను. ఇది దేవుడికియ్యి" అన్నాడు పట్టుదలతో. ఎంత బోధపరిచినా చిన్నాడు వినే పరిస్థితిలో లేడు. రామం కేమీ చేయటానికీ తోచలేదు. కమల యీ పరిస్థితినంతా చూచి కొయ్యబారిపోయింది. చేసేదిలేక కాస్సేపు మౌనంగా కూర్చున్నారు. చిన్నాడికి మళ్ళీ నీరసమధికమైంది. చిన్నాడు మళ్ళీ కాఫీ యిమ్మని అడగలేదు. ఒకవేళ యిమ్మంటే అందులో ఏ మందు కలిపేసి యిచ్చేస్తారో, తనేమైపోతాడో" అని అసలు అడగటం మానేశాడు. "చిన్నా కాఫీ యివ్వనా?" అన్నాడు మళ్ళీ రామం. "ఊహుఁ" అని నిరాకరించాడు. కమల చిన్నాడిని వడిలో కూచోబెట్టుకుని, "నా చిట్టివి కదూ, కాఫీ త్రాగు నాన్నా" అని బ్రతిమాలింది. చిన్నాడు మొదట్లో అంగీకరించినా మందుసంగతి మళ్లీ జ్ఞాపకంవచ్చి కాఫీ నోటిదగ్గరకు తెచ్చేసరికి నోరు మూసేశాడు. ఇక ఏ విధంగా నచ్చచెప్పాలో వాళ్లకర్థంకాలేదు. చిన్నాడు ఆహారంలేక చాల నీరసించిపోయాడు. డాక్టరు సలహాప్రకారం నాలుగో మోతాదు యిచ్చేవేళకూడా దాటిపోయింది. చిన్నాడిదగ్గరకు ఏది తీసుకుని వెళ్లినా మందని భ్రమించి నిషేధిస్తున్నాడు. మందు పుచ్చుకోకపోవటం, ఆహారం లేకుండా వుండటం, చిన్నాడి పరిస్థితి రాత్రిలా మారిపోయింది. కమల పూర్తిగా గుండె జారవిడిచింది. చిన్నాడిని చూస్తూ అలా కూర్చుండిపోయింది. ఒక్కరోజులో చిన్నాడిలో కలిగిన ఆందోళన పరిస్థితితో కమల రెండు మాసాలు జబ్బుపడ్డ మనిషిలా మారిపోయింది. చిన్నాడు మళ్ళీ పలవరింతలు ప్రారంభించాడు. "తాతయ్యా! చూడు తాతయ్యా. అమ్మ నాన్న నాకు మందు యిస్తారట—మందిస్తే చచ్చిపోనూ— నీవు రావు తాతయ్యా? పిప్పరమెంట్లు తీసుకువస్తావు కదూ?" యీ పలవరింతలు విన్న రామం డాక్టరుదగ్గరకు వెళ్లి జరిగిన సంగతంతా చెప్పాడు. డాక్టరు వచ్చి మళ్లీ యింజక్షనిచ్చి పరిస్థితి బాగులేదని చెప్పి, పెదిమె విరిచి వెళ్లాడు. రామం వెంటనే మామగారికి వైరుయిచ్చాడు. చిన్నాడు కళ్ళు మూసుకునే తాతయ్య కావాలన్నాడు. "వస్తున్నారు బాబూ" అంది కమల.

రామంకి చిన్న ఆలోచన తట్టింది. మామగారిని స్టేషనుదగ్గర కలుసుకుని సంగతంతా చెప్పి, డాక్టరిచ్చిన మాత్రలను తను తెచ్చిన పిప్పరమెంట్లుగా చిన్నాడికిప్పిస్తే, మందు ఓ విధాన లోపలికి వెళ్తుందని ఆశించారు. ఈ ఆలోచన కమలతో చెప్పాడు ఆమె సరే అంది. మామగారు వచ్చే ట్రయిన్ ఊహించి రామం స్టేషనుకు వెళ్లాడు.

రామం స్టేషన్‌కి బయలుదేరిన కొద్ది క్షణాలలోనే చిన్నాడి పరిస్థితి విషమించింది. తన ప్రక్కనున్న బట్టను చించేస్తున్నాడు. "అమ్మా, నాన్నా" అని కేకలు వేస్తున్నాడు. కాళ్ళు చేతులు కొట్టుకుంటున్నాడు. పసి హృదయం గింజుకుంటోంది. కమల క్షణ క్షణానికి గుమ్మంవద్దకెళ్ళి చూస్తోంది. కాని యింతకీ వాళ్ళు రావటం లేదు. కమల నిలువునా నీరైపోయి చిన్నాడి ప్రక్కలో పడిపోయింది. చీకటి పడింది. సందె దీపం వెలిగించింది. చిన్నాడి కదలికలు పలవరింపులు తగ్గిపోయాయి. చిన్నాడి ముఖంలో ముఖం పెట్టుకుని చూస్తోంది. చిన్నాడి శరీరం పైని చమట కనిపించింది. కాళ్ళు చల్లగా తగిలేయి. గాబరాతో వళ్లంతా తడిమింది. వళ్ళంతా చమటగా కనిపించింది. ఇంటిలో దీపం గిజ గిజ కొట్టుకుంటూంది. కమల హృదయం అలానే గింజుకుంటూంది.

రామం మామగారితో సహా యింట్లో అడుగుపెట్టేసరికి కమల కెవ్వు మనటం దీపం ఆరిపోవటం అంధకారమలముకోవటం ఒక్కసారి జరిగేయి. ★



# హక్కులుపోతే

నేను చెప్పదలుచుకున్నవన్నీ చెప్పితే నిజంగా ఒక పుష్కరం పుష్టిగా సరిపోవచ్చు. నమ్మండి నమ్మకపోండి. అసలు నాలో నేనే ఆలోచించుకున్నాను—చెప్పనా వద్దాఅని. అయితే ఏంలాభం - నా నోరు - అన్ని హక్కులు తనవేనని - స్వతంత్రభారతంలో నాకూ స్వతంత్రం వున్నదని చాటినట్లుగా - నా దగ్గరనుండి వాక్కుని ఇష్టారాజ్యం వెలిగిస్తూవుంది. తత్కారణంగానే చెప్పదలుచుకున్నవి - చెప్పదలుచుకోనివి - ఇవి అవి అనే భేదంలేకుండా సర్వం బాకా పెట్టుకొని వూదినట్లుగా బాహాటం చేస్తోంది. అదిక్కడ నా ఖర్మమే. ఇవి అందరు వినచ్చు. వినకపోవచ్చు. వినవద్దనే నా ప్రార్థన ఎందుచేతనంటే - అది అన్ని అరిచేస్తోంది. దేముడు వరంఇచ్చినా - పూజారివల్ల (అతనిష్టప్రకారం) మనకు రావలసిందేగా. అదేమాదిరిగా నా జన్మ హక్కులు దోచుకుందని 'కేసు' ఫైలు చేద్దామంటే - నోరుపడనిస్తేగా! అందువల్ల అన్యాయంగా నా ఆస్తిని ఆక్రమించి వాగుతున్న నోటివాక్యాల ననుసరించి ఎల్లాంటి చర్యలు తీసుకున్నా అవి నన్నేమి బైండు చెయ్యవు. వినద్దనటం ఎందుకంటే — విన్న వారూరుకుంటారు - తామేమో విమర్శక శిఖామణుల మనుకున్నట్లు ఆ నోరు చెప్పేదంతా నిజమే - వాడికింత కండకావరమా...అని విమర్శిస్తారు. స్వంత ప్రభుత్వంలో దానికి స్వంత హక్కులున్నాయి కాబోలు అన్యాక్రాంతానికి.

ఇంతకూ అసలు గొడవేమిటంటే - మొన్న మా చాకలివాడుంటే ఇంటికెళ్ళి "ఏరా! చాకలి నాబట్ట లేవి? నెలరోజులైంది తెచ్చి...ఇచ్చే..." అని నా మాటలు పూర్తికాకుండానే - "చాలు చాల్లే వయ్యా - నువ్వేమో పెద్దమనిషి వనుకున్నా ... ఏరా...గీరా...అని అనమాక...అసలు నీ బట్టలు నా దగ్గర లేవు... పో...నీకేనా అంతస్వతంత్రం...నాకు లేదా..." అని ఒక్కే వరుసని ఏకరువు పెట్టాడు ... దాంతోటి ... అక్కడ వాళ్ళందరుమూ గారు...అసలు సంగతి ఎవరికీ అక్కర్లేదు ... "ఏమిటయ్యా నీ పొగరు...డొక్క చీలుస్తాం..."

ఇదీవరుస ... చావుతప్పి కన్నులొట్టపోయి - ఇంటికి జేరుకున్నా. నిజం ఆలోచించండి... నెలరోజులుఅంటే 30 రో... కష్టపడి సంపాదించిన ఎనభైరూకలలో 40 రూపాయల విలువగల బట్టలు(కొత్తవి) చాకలి డబాయించి లాగేశాడంటే ఎంత బాధపడాలో ఊహించండి.

ఇదిల్లావుండగా గోరుచుట్టు మీద రోకటి పోటన్నట్టు - దున్నేవాడిదే భూమి అని రావటంతో - ఏకు మేకై కూర్చున్నాడు పాలంకవులు పుచ్చుకున్న ఖరారిమనిషి. అది నిజంగా నాకష్టార్జితం...తాతముత్తాతలు గడించింది కాదు...పోతేపోయిందని వూరుకుంటానికి...నాకిచ్చే ఎనభైకాక నెలకు యాభై మొదలు డబ్బైదాక ప్రైవేట్లు చెప్పుకుని (సూర్యోదయంనుండిచంద్రోదయంవరకు) సంపాదించి కూడబెట్టి చెమటోర్చిన కష్టఫలం ఆ రెండెకరాలు. అదైనా చవకబారు పొలంకాబట్టి...ఏదో సంపాదించుకుంటూ వేడినీళ్ళకు చన్నీళ్ళన్నట్టు పాలంకవులుకిచ్చి వచ్చినదాంతో కాలక్షేపం చెయ్యాలని నా వుహా ప్రపంచపు ఛాయాచిత్రణ. కాని అది దున్నేవాడిదే భూమి అనే కిరణంవలన...నా హృదయ పేటికలోని ఆలోచనా ఫిలిము పాడయుంది...వ్యవసాయం స్వయంగా చెయ్యగలశక్తిలేదు...ఉన్నా ఆ ఫలసాయం చాలదీ జానెడు - భార్యా ద్వితీయ పొట్టకు. అల్లాంటిసమయంలో అభూమి— 10 సం॥ రాల కష్టార్జితపొలం — ఉపవాసాల ఫలితం...అన్యాక్రాంతం—అన్యాయంగా — అయిపోయిందంటే ... ఎల్లా వుంటుందో మీరే ఆలోచించండి—

ఒక్కమాట మరిచేపోకండి...ఈ విధంగా నానోరుకూడ హక్కులను—స్వహక్కుభుక్తం చేసుకొని వున్నవీ లేనివి వాగుతోంది...దాన్ని ఎవరు పాటించవద్దు, చివరకు ... ఆలకించనైనావద్దు... చూడండిబాబూ ఆనోరు ఇంకా ఏమిటో వాగుతోంది...వినద్దు...వినద్దు...

మూలిగేనక్క మీద తాటిపండు పడ్డట్టుగా...వున్నట్టుండి—మాఇంట్లో ఒకపక్క అద్దెకున్నాయన...12 సం॥ ర...కంటేఎక్కువున్నాను...కాబట్టి ఈభాగం నాదేనని బిఱ్ఱబిగిసిపోయాడు. అసలాయిల్లు సర్వకాల సర్వావస్థలయందు సూర్య చంద్రాదలకు — శీతోష్ణములకు- స్వాగతమిచ్చే గుణవంతురాలు. బల్లుల మొదలు — పాములు తేళ్లు ... మొదలగు (క్రూరజంతువులను కాఠిన్యమైనా లేకుండా) వాటివరకు ఒకొక్కప్పుడు ఆశ్రయమిచ్చి — ఆ శ్రమదీర్చే — కల్పవృక్షం. కామధేనువు. అదొక్కటే నా పూర్వులకీర్తి శిల్ప శిధిల చిహ్నం. దాన్ని...వారసులతో దెబ్బలాడి...తగవులాడి...దాదాపు కొత్తఇంటికగు డబ్బుఖర్చుచేసి ... దావా నెగ్గించుకొని సంపాదించుకొన్న విజయ విన్నాణం... అల్లాంటిదాన్ని...అమాంతగా ఆక్రమించుకుంటానంటే నేనేంచెయ్యను ... ఏదీ దిక్కు...

ఇల్లాంటివి చాలావున్నాయి చెప్పాలంటే. ఓజాబితా తయారుచెయ్యమని ముప్పదిమూడుకోట్ల దేవతలకి ఆజ్ఞయిస్తే... దాదాపు ఒక శతాబ్దమైనా వ్యవధిస్తేనే గాని పూర్తిచెయ్యలేమని తిరుగు టెలిగ్రాం ఇచ్చారు...

వుండటానికిల్లు, కట్టడానికి గుడ్డ—చివరకు తినతిండిలేక నేను—నన్ను కట్టుకు

(18-వ పేజీ చూడండి)

శ్రీ భమిడిపాటి అనంతశ్రీకృష్ణమూర్తి

# మా కాలేజి

అన్ని కాలేజీల్లాగే మా కాలేజీను. అన్ని కాలేజీలకి మల్లేనే మా కాలేజీకి రూల్సు, రెగ్యులేషన్లూ ఉన్నాయి. మిగతా కాలేజీల్లో పరీక్ష తప్పే వాళ్ళుంటారు. కాని మా కాలేజీలో ప్రతి వాళ్ళు కృతార్థులవుతారు. దాంట్లో ఓ రహస్యం ఉంది. చెప్పొద్దూ! మిగతా కాలేజీల వాళ్ళకి మల్లే అందర్నీ జేర్చుకోక అన్ని విధాల నూటికి ముప్పదియైదొచ్చిన వాళ్ళని జేర్చుకుంటాము. రూల్సు, రెగ్యులేషనులూ అంటే గుర్తొచ్చింది: అన్ని కాలేజీలకు వేసంగి సెలవలు, దసరా సెలవలు అంటూ ఏవో ఉంటాయి. కాని మా కాలేజీకి అన్ని రోజులూ పనే లెక్క తీస్తే. లేదూ అన్ని రోజులూ సెలవే. మిగతా కాలేజీలకు కొన్ని గంటల్లోనే పని. కాని మరి మా కాలేజీకి ఇరువదినాల్గు గంటలూ పనే. మాకు తోచిన గంట పనుంటుంది, లేదంటే లేదు. అన్ని కాలేజీలలోను స్టూడెంట్సు ఒక గదిలో జేరి హాజరు వేయించుకుంటారు

కాని మా ప్రత్యేకతేమిటంటే, మా ప్రొఫెసర్సే స్వయంగా వాళ్ళ యింటికి వెళ్ళి...యింటి దగ్గర కాకపోతే రోడ్డుమీదైనా, పార్కుల్లోనైనా కనబడితే అటెండెన్సు మార్కు చేస్తారు.

ఒకసారి మా రిజిస్టరులో పేరెక్కించడం అంటే దాంట్లోంచి కొట్టి వేయడం చాలా కష్టమైన పని. అన్ని కాలేజీల్లోకి మల్లేనే మా దాంట్లో కూడా రెగ్యులర్ అటెన్డెన్సు కొట్టేవాళ్ళు, లేటుకమర్సు ఉంటారు. లార్డ్సుకి మల్లే ఏ మూడు రోజులకో ఒకసారి వచ్చి పోయే రకాలున్నారు.

## సుగుణ

మిగతా కాలేజీల్లో అల్లాంటి విద్యార్థుల పేరు కొట్టేసి ఫైను చెల్లిస్తేనే గాని మళ్ళీ పేరు వెయ్యరు. కానిమా దాంట్లో పేరుకొట్టి వెయ్యడమే జరగదు. అధవా జరిగినా ఫైను చెల్లించేది మా ప్రొఫెసర్సే. అది ధనరూపంలో కాదు. తీక్షణదృక్కుల రూపంలో. అన్నిటల్లోను ఆల్ఫబెటికల్ ఆర్డరును బట్టి రోల్ నంబర్సు యిస్తారు. కాని మేం నిష్పక్షపాతులం కన్క అందాన్నిబట్టి పేర్లు వ్రాస్తాం. ఇంకో విషయం మిగతా రిజిష్టర్లలోవలె మా దాంట్లో ఒకేరకమైన సిరాతోగాని, ఒక రకమైన అచ్చులో ఉండవు. కొన్ని 'స్మాల్ టైపు,' కొన్ని 'బోల్డు టైపు,' కొన్ని రంగు సిరాల్లోను వ్రాయబడి ఉంటాయి. ఒకే పేరు నాల్గయిదు రంగుల సిరాలతో తిర్చి దిద్ది ఉంటుంది. అన్ని రంగుల్లో వ్రాయబడినవి ముందుగా వ్రాయబడతాయి. వాటినిగురించి స్పెషల్ కేర్ తీసుకోవలసిన ఘటాలవి. ఇతర కాలేజీల్లో ప్రతీప్రొఫెసర్‌కి అభిమాన శిష్యులున్నట్లు, వీరిది ముఖ్యతరగతి. బోల్డు టైపులో వాళ్ళ అటెండెన్సు మరీ అంత ఇర్రెగ్యులర్‌గా ఉండదు. స్మాల్ టైపు వాళ్ళది ఏదో ఒక మాదిరిగా ఉన్నా ఎప్పుడో ఒక సారైనా ప్రెజంటు వేయించుకుంటారు.

ఇంకో గొప్ప విషయం. మాకేం అప్లికేషన్లు లేవు. ఎడ్మిషన్ ఫీజు లేదు. తండ్రి పేరు, కులం యీ వివరాలేం అక్కర్లేదు. పేరైనా వ్రాసినా వ్రాయకపోయినా ఇబ్బంది లేదు. కాని మా రిజిష్టరులో మట్టుకు ఏదో ఒక్క చక్కటి పేరులో వ్రాస్తాం. మిగతా కాలేజీల్లో అటెండెన్సు పిలవడం, వచ్చాసార్, హాజర్ సర్, ప్రెజంట్ సర్ అన్న సమాధానాలతో సంబంధం లేకుండా క్రొత్త పంధాలుమావి. అల్లా కళ్లతో చూడడం ప్రెజంటు వెయ్యడం జరుగుతుంది.

మా కాలేజీలో చదువైపోవడం అవ్యక్తి ఆ ఊరు వదలి వెళ్ళిపోతేనే గాని జరగదు. మా సిండికేట్‌లోని మెంబర్లంతా ఆ వ్యక్తి వెళ్ళిపోయేటప్పుడు 'కాండక్టు' (Conduct) సర్టిఫికేట్ యిస్తారు. కాని ట్రాంస్ఫర్ సర్టిఫికేటే ఒకసారి యిస్తారు, అది వివాహ సందర్భంలో. ఆ తర్వాతైనా పూర్వ విద్యార్థి (Old student) అన్న అభిమానం చంపుకోకుండా వాళ్ళు వచ్చి వపుడు కుశల ప్రశ్నలు వేసి, వాళ్ళున్నన్ని రోజులూ అటెండెన్సు వేస్తూ ఉంటారు.

మా దాంట్లో స్టూడెంట్సంతా 'ఫెయిర్ సెక్సు' 'ది కాలేజి రివో పెన్సు, ఎడ్మిషన్సు విల్ కమెన్సు' అని ఏ పేపర్లోను 'ఎడ్వర్ టైజు' ఉండదు. అదంతా మా 'డెసిషన్' బట్టి ఉంటుంది. మా కాలేజీ పేరు 'ది కాలేజ్ ఆఫ్ ఏన్‌జల్స్.' ★

(17-వ పేజీ తరువాయి)

న్నందుకు నా అర్ధాంగి మలమలామాడవలసివచ్చింది...పస్తులుండవలసి వచ్చింది. దాంతో అన్ని మాకు ఏకాదశులే—ఒక్క ఏకాదశి వుపవాసానికే స్వర్గం దొరికే ఈ రోజుల్లో ఇన్ని ఏకాదశుల పుణ్యంచేసిన మాకు ఎక్కడ చోటివ్వాలో తెలియక స్వర్గాధిపతి 'Situation' కోసం ప్రపంచ పత్రికలో 'Wanted' కాలమ్సులో ప్రచురించారు ... నాబోటి వాళ్ళందరికి ఆ స్వర్గంలో సీట్లున్నాయి...కాని వాటి కోసం ఏవిధమైన ఆదుర్దా పడవలసినది లేదు. ఎందుచేతనంటారా ... సీనియారిటీ ప్రకారం వాళ్ళే Seleot చేసుకుంటారు.

ఈ స్వతంత్రదేశంలో అంగాలనుండి స్వతంత్రమై పట్టపగ్గాలు లేకుండా పోతున్నాయి.

కాబట్టి మళ్ళీ మనవిచేసుకుంటున్నాను దయవుంచి నా నోటిమాటలు వినవద్దు... వినద్దు...దూరంగాపొండి. అదుగో పోలీసులు ... లాఠీఛార్జీ ... తుపాకుల చప్పుడు...దూరంగాపొండి...పొండి...



# కృత్తికాస్నానాలు

"నేను మొట్టమొదట చెపితే ఏమన్నా విన్నావా? వింటే ఇవ్వాళ నిన్నా రత్తమ్మ ఇంటిమీదకొచ్చి తిట్టగలిగేదా? అయినా, నా మాటమీద నీకు లక్ష్యముంటే కదూ!" అని భర్త రామారావు అంటూంటే సూర్యకాంతం సహించలేకపోయింది.

"ఇదోటి చేతనయింది, ఇంట్లో, పెళ్ళామ్మీద అధికారం చలాయించడమే కాని, ఆ రత్తమ్మ నన్నలా తిడుతూంటే ఆడదానికంటే అన్యాయంగా తలకాయొంచుకుని ఇంట్లో కూర్చుపోతే, 'నా పెళ్ళాన్నిలా తిడతావా?' అని రత్తమ్మనీ, 'ఏమయ్యా నీ పెళ్ళాం మా యింటిమీద బడి తిడుతూంటే చూస్తూ ఊరుకుంటావా?' అని రత్తమ్మ మొగుణ్ణీ పల్లెత్తుమాట అనగలిగారా? మీకు పౌరుషముంటే, అభిమానముంటే అలాంటి పని చెయ్యండి. కాని లోకువగా ఉన్నానని నన్ను నోట్లో వేసుకోడం" అని చరచరా వంటింట్లోకి వెళ్ళిపోయిందా గృహిణీలలామ. అసలా రమణీరమణుల మధ్య ఇంత తీవ్రత కలగటానికి కారణం ఇది.

ఆ పల్లెటూళ్ళో వున్న ఉచ్చజాతుల్లో కాస్త పచ్చగావుండి నాలుగు కుటుంబాలు కలవాళ్లు కాపులు. అంతా వ్యవసాయదారులు. అంతా ఒక ఇంటిపేరు వాళ్ళే.

ఆ వూళ్ళో ఒక్కగానొక్క బ్రాహ్మణ కొంప రామారావుది. పక్కవూరి స్కూల్లో మేష్టరు. వాళ్ళ వూళ్లో బోర్డు స్కూలు లేదు. వుంటే యెలాగో–ఏ తిరుపతి వేంకటేశ్వరుడి దయవల్లో – ఉన్న వూళ్ళో మేష్టరీ వేయించుకునేవాడే. ఉన్నవూరు వదలలేక రోజూ నాలుగు మైళ్ళు సైకిలు మీద వెళ్ళి ఉద్యోగం చేసుకుంటున్నాడు. ఉన్నవూళ్లో ప్రైవేట్లవల్ల గౌరవాదికాలు సంపాదించుకుంటున్నాడు.

భార్యా సూర్యకాంతం చిన్నప్పుడు చదువుకున్న మూలాన భారత భాగవతాదులు భాగ్యవంతులయిన కాపులస్త్రీలకి వినిపిస్తుండేది. వాళ్ళతో ఆమెకి బాగా పరిచయం. ఆవిడకి అత్తామామా లేరు, పోరూ లేదు, పనీ లేదు. పొద్దున్నే అంత వార్చి భర్తకి పెట్టి, మధ్యాహ్నానికి కారేజీలో సద్ది యిస్తూంటూంది. ఇంకాయిన సాయంత్రందాకా రారు.

ఈలోగా ఆవిడ – భక్తిచేతనయితేం, ఊచిపోడానికయితేం – నలుగురు నెచ్చెలుల్ని పిలుచుకువచ్చి, సాయంత్రందాకా కాస్సేపు ఏదో చదవడం, కాస్సేపు ఏ దేవుడిభజనో చేస్తూండడం ఇదీ ఆవిడగారు చేసే కార్యక్రమం. ఇలా కొద్దిరోజులు గడిచాక ఒకనాడు రామారావుగారన్నారు.

"ఇదిగో చూడు! నువ్వు చేసేపని చెడ్డదనను, కాని మంచిదీ కాదు. ఆమాత్రం భగవద్భక్తి పల్లెటూళ్ళోవుండే నీకుండంటే ఆశ్చర్యం లేదు. కాని నువ్వు ప్రారంభించిన ఫక్కీ మంచిదికాదు. మీ ఈ కార్యక్రమం ఎల్లకాలం సుహృద్భావంతో జరగదు. ముందు ఏదో చదవడం వినడం – ఆ తరవాత భజనలు – లోకాభిరామాయణం, దాన్తోటి ఆత్మస్తుతి పరనింద, దానివల్ల వాగ్వాదం – అంతటితో ఆక్క "శిగపట్ల గోత్రం" దాకా వస్తుంది. ఆపయిన నీయిష్టం "చాలెద్దురూ! పెద్ద ఏదో ఆడాళ్ళకి స్వతంత్రముండాలంటో పత్రికలకి రాస్తారు. కాని ఏదయినా సత్కాలక్షేపానికయినా సరే భార్య మొదలెట్టిందంటే "మండూ" అంటూ బిరబిగుసూ పోయి చెప్తారు. మేమేం నీతివిరుద్ధమయిన పని చెయ్యటం లేదు – తెలివిగా ప్రవర్తిస్తే బబ్బలా లెందుకొస్తాయి." అని రామారావుగారిని మళ్లీ మాటాడకుండా చేసింది.

నిజంగా రామారావుగారన్నట్టుగానే జరిగింది. 'శిగపట్లు' కొంచెం జాగ్రత పడటంవల్ల తప్పిపోయాయి గాని లేకపోతే అంతపనీ జరిగితీరేదే.

కార్తీకమాసం వచ్చింది. "ఏమో! మనకి పెద్ద పనులూ లేవు. ఏమీ లేవు కదా! యే సావిత్రీ చరిత్రో లేకపోతే బ్రహ్మంగారి కాలజ్ఞానమో ఎలాగా చదువుకుంటాము కదా. అలాంటప్పుడు రోజూ తెల్లారగట్టే లేచి, కృత్తికాస్నానంచేసి, దీపాలు పెట్టుకుని, తెల్లారగట్టప్పుడే ఆ చదువుకొనేదేదో చదువుకుంటే కాస్త పుణ్యం ఎక్కువగా వస్తుంది కూడాను. ఏం? అలా చేద్దామా?" అన్నారు సూర్యకాంతంగారు. ఇంకా సంఘంలో ఆవిడగారి మాటకి తిరుగనేది లేనేలేదు. వెధవది హిందూ లాబిల్లు ప్యాసవడమన్నా, కృష్ణా, పెన్నారు ప్రాజెక్టులు కట్టించడమన్నా, రామపాదసాగర్ మాట ఎత్తడమన్నా, బ్లాకుమార్కెట్ పోవడమన్నా, అంటే జరక్కపోవచ్చు గాని యీ సంఘంలో మాత్రం సూర్యకాంతంగారి ప్లాను నెగ్గకపోవడం, అది అక్షరాలా జరక్కపోవడం అనేది లేదు. ఇంకంతపై అని ఆచరించడం మొదలెట్టారని కూడా వేరే చెప్పటానికవసరం లేదు. మర్నాడు ప్రొద్దున్నే కావిళ్ళతోటి నీళ్లు తేవడానికి వెళ్ళిన మగాళ్లకందరికీ చెప్పక్కర్లేకుండానే, పావంచాలమీది ముగ్గులూ, చెరువులో అరటి గొప్పలూ, పూలూ, రాత్రిళ్లు భక్తురాళ్లంతా స్నానాలు చేశారని తెలిసిపోతూంది – ఊళ్లో ఆవునేయి గిద్ద అర్ధరూపాయయి కూచుంది. అదివఱకు అరణాలుగానే ఉండేదల్లా మహా హంగామా తోటి ఆ అబలామణులు, తెల్లారగట్ట లేవటం హరికేన్ లాంతర్లూ, ఆరేసినబట్టలుసర్దిన సజ్జలూ, పుచ్చుకొని, ఎంకాయమెమ్మదిగా, సూరేకాంతంగారూ! లెండి, రండి" అని కేకేసుకుంటూ నడవడం ఆ తరువాత సూర్యకాంతంగారి యింటిముందు తులిసెమ్మ చుట్టూరా కూచుని ఏదో సూరేకాంతమ్మగారు చదువుతూంటే వింటం జరుగుతోంది.

అందులో ఒకావిడగారు ఓనాడొచ్చి నట్టేవచ్చి మన్నాడు రాటం మానేసింది. "ఏమో! స్నానానికి రావటం మానేశావూ?"

## శ్రీ యేలూరిపాటి అనంతరామయ్య

అని సూర్యకాంతంగారు నీలాటి రేవులో నిలేశారు. ఆవిడ "అప్పయ్యగారూ! నాకు రావాలనేవుంది. గానండి మీ మరిదిగా రొప్పుకో లేదండీ!" అంది. "ఏం!" నా వాళ్లసలే మంచిదికాదంటండి, రోజూ స్నానాలూ, ఉపోసాలూ, చేస్తే, రోగ మొస్తుందిటండి, అగికాకుండా ... అదే మిఁంసమ్మా.. జ్ఞాపకం రాటంలేదూ!... కాని ఏదో పద్యంకూడా చదివారు. ఊఁ... పూర్తిగా జ్ఞాపకం రావటంలేదు, ఆఁ కొంచెం జ్ఞాపకం వచ్చింది - "ముగురాడువారు కూడిన, సుగుణాకర! పగటిపూట - చుక్కలు పొడుచుగా" అని చదివి, "అలాంటప్పుడు మీలాంటి లోకజ్ఞానంలేనివాళ్ళంతా ఓచోట పోగైతే ఇక జట్టీలకి చెప్పుకోక్కర్లలేదు. గోజుకో మనిషిమీదికో



కేసు వొస్తూంటుంది" అన్నారు. "అలా యెందుకవుతుందండి వెడతా"నంటే, "ఓ యబ్బో! మీ పాత్తైవరెరగరు, మొన్న పండక్కి మీ నాన్నగారింటికి వెళ్లేటప్పుడేం జరిగింది. మొగాళ్లపెట్టెలో కెక్కితే తోపిడిగావుంటుందని ఆడాళ్ళ పెట్టెలో ఎక్కితే దిగొచ్చేప్పటికి జుట్టుజుట్టూ పట్టుకోడానికి ఓ ఆవిడా, నువ్వూ, సిద్ధమవలా? వెళ్లొ"ద్దన్నారు.

"వాళ్ళంటే ఎరగనాళ్లు కనకా, ఆవిడ నామీద తనవిసుక్కొలెయ్యటం మొదలెట్టి "చస్తున్నానమ్మా! మాయ గోల, మాయ కాళ్ళూ", అని నేనంటే ఆవిడ నన్ను తిట్టటం మొదలెట్టింది కనకా, దెబ్బలాటొచ్చింది. కాని అంతా ఎరిగున్నాళ్ళం, ఇరుగుపొరుగు వాళ్ళం, మాకు దెబ్బలాటెందు కొస్తుంది. వెడతా" అన్నాను, దానితో ఆయన మండి "వెళ్లు, నా యిష్టమేముందలా టప్పుడు. నా మాట నీకు లెక్కేంటి, బోడిమాట. కాని యీ మాటలుమాత్రం మరిచిపోకు. యిదివరకిలాగనే చెపితే వినకే జబ్బుపడి రెండుమాట్లు రెండు రెళ్లు నాలుగు వందలు తగలేయించావు. యీసారి రోగం వచ్చిందని మూలిగావంటే, కాసుమాత్రైనా తేను. మాటిమాటికీ రోగాలకంటూ వందలు తగలెయ్యటానికి నేనేం మీఅన్నయ్యలాలక్షాధికార్ని కాను. తరవాత నీ యిష్టం" అన్నారు— "ఇక నేనేం చెయ్యను. మీరే చెప్పండి," అందావిడ. "అదేమిటో అలాగంటావూ! మన కామాత్రం సొతంత్రం వుండక్కర్లా, అసలు సొతంత్రమంటూ మన కేముందో! మొన్నామధ్య మా ఆడబడుచుగారూ రెళ్ళాను. అక్కడ ఆడాళ్లు మనలాగ పూజలు చెయ్యటం లేదు. పురాణాలు చదవటం లేదు. కానీ ఏమిటో! మీటింగుల్ల, పత్రికల్ల. ఒకటేమిటి? కళ్ళకీ, కాళ్ళకీ జోళ్లెట్టుకుని, ఎంచక్కా ఎలా వుంటారనుకున్నావూ! మనకి అలాంటి యోగం లేదు సరికదా! కొంచెం కృష్ణా, రామా, అనికూడా అనికోనీరేంటి? మన మొగాళ్లు; మొదట్లో మా ఆయనా అలాగే అన్నారు. మరి అయితేయేం నే రావటంలా? స్నానాలకి; పైగా పురాణం, భజన్లూ మా యింట్లోనే జరుగుతున్నాయి కూడాను. ఎవరన్నా నవ్విపోతారు గాని— ఇవ్వాళ ఎల్లాగోలాగ మీ ఆయనతో సమాధానపడి రేపన్నుంచి రా! అయ్యో యిసరొట్టొచ్చా మాయదారిది, మాటాడుతూ మరిచిపోయాను" అని సూరేకాంతంగారు వెళ్లారు. కాని మళ్లీ ఆ పెద్దమనిషి భర్తమాటమీది గౌరవమే అనండి మళ్ళీ భజనలకీ స్నానలకీ రాలేదు - ఆవిణ్ని ఆ సభ్యురాండ్రు మాత్రం తీవ్రంగా వ్యాఖ్యానించారు. ఈ వ్యాఖ్యానం ఎలాగయితేం ఆ పెద్దమనిషి చెవిలోపడింది సూరేకాంతం గార్ని ఎలా పరాభవించాలా? అని ప్లాన్లు వేస్తూంది.

కార్తీక సోమవారం వచ్చింది, ఆదివారంనాడు అంతా కలిసి స్నానాలు చేస్తూండగా "ఏమో! రేపు ఏకాశీ సోమవారం కలిసొచ్చాయి. ఎంతో పర్వమయిన రోజు రేపు. రేపుకూడా యిక్కడే స్నానం చేసేదానికంటే రాజమండ్రి కోటిలింగాల క్షేత్రంలో స్నానంచేసి, - కార్తీక పురాణం చెపుతార్ట. అక్కడ-వినొచ్చి, రేపల్లా ఉపవాసంఉండి ద్వాదశినాడు మధ్యాహ్నం భోంచేసి, రాత్రి క్షీరాబ్ధిశయన వ్రతం చేసుకుందాం" అని సూరేకాంతంగా రన్నారు. అంతా 'సరే' అన్నారు.

అప్పుడంతా ఆదివారం సాయంత్రానికే రాజమండ్రివెళ్లి కోటిలింగాలసత్రంలో ఆ రాత్రి కాలక్షేపంచేసి, పురాణం విని, ఉదయం ఒంగోలు కోచీలో బయలుదేరి యింటికి చేరారు.

ఏకాశీ ఉపవాసంతో గడిపి, చీకటడ్డాక యీరాత్రి జాగారం చేద్దామనుకొని, సూరేకాంతంగారింటికొచ్చి బరకం పరుచుకొక్కుని సూరేకాంతంగారు చదువుతూండగా ఏదో, అంతా ఆహా! అనటం మొదలెట్టారు. ఏదో సందర్భంలో పారిజాతాపహరణం మాటొచ్చింది. సూరమ్మగారు చిన్నప్పుడు పారిజాతాపహరణం వాళ్ళ నాన్నగారి దగ్గిర చదువుకున్నారు. కనుక నోటికి వచ్చిన పద్యాలు జోడిస్తూ కథ చెపుతూ "జలజాతాసన వాసవాదిసుర పూజాభాజనంబై తనర్చులతాంతాయుధు గన్నతండ్రి శిరముచ్చో వామపాదంబునం, దొలగంద్రోచె లతాంగి, అట్లయగు నాథుల్నేరముల్సేయ పే, రలుకం జెందిన యట్టి కాంతలు చితవ్యాపారముల్నేర్తురే" అన్న పద్యం చదివి భావం చెపుతూ, ఇదివఅకటి పెద్దమనిషైన వెంకాయమ్మ మొగుడు "ముగురాడువారు గూడిన, సుగుణాకర! పగటిపూట చుక్కలు పొడుచుగా" అని వెంకాయమ్మ దగ్గిరైతేమాత్రం యెందుకనాలీ అనే ఉక్రోషంతోటి "దేవుణ్ణి అంతమాటనగూడదు, కాని మా బాగా తన్నింది సత్యభామ" అందా భామామణి. "అలా తన్నకపోతే పారిజాతం తెచ్చేవాడా?" అందింకో రమామణి. "దెబ్బకి దెయ్యం

జపుస్తుందంటండీ" అందింకో లలనామణి. అంతా యిలా గంటూన్నందుకు బాధపడుతూ. "నిజంగా సత్యభామ అలా తన్నిందంటారాండి, మన మురళీకృష్ణుణ్ని" అందో భక్తురాలు. "ఏమ్మా! అందుకు సందేహం? ఈ కాలంలో వున్న ఆ వీధి రత్తమ్మగారేం చేసింది," అంది. "ఏమిటండోయ్ మేం వినలేదు" అన్నారొకరు. "అమధ్య రత్తమ్మగారి భర్త అర్ధరాత్రివేళ నిద్దరపొద్దులో వచ్చి "చిటపట చినుకులు దుప్పటి తడిసెను తలుపు తీయవే భామా" అన్నట్టు కేకేశారు. ఆ తరవాత రత్తమ్మగారు తలుపుతీసి "వాటమైన బంగారపు దుప్పటి కొటుకమరకేమోయీ కృష్ణ! గోవిందా! నీ చక్కనిగోరులు, కొనలు వంగనేమోయీ!" అని ప్రశ్నలు వెయ్యడం మొదలెట్టింది. ఆయన వెంటనే వెధవ పౌరుషం చూపించటానికి ప్రయత్నిస్తే ఆవిడగారు "మూలనున్న చీపురుగట్టం దటాలున నెత్తి ధనధనాత్కారమ్ముగా" వాయించటం నే స్వయంగా చూశాను." అంది పురాణధోరణిలో చమత్కరిస్తూ. అని "సత్యభామ యేంచేసిందో ఆ పురాణ దంపతుల రహస్యాలు తలిస్తే మనకి పాపం వస్తుంది. కాని మన ఆ రత్తమ్మగారు మాత్రం యీపని చేసితీరింది" అన్నారు సభ్యురాండ్రు హర్షధ్వనులు చేశారు. జాగరణ యిలా ముగిసింది.

మర్నాడు ఆ సమాజంలోని నారదుని ప్రియశిష్యురాలయిన ఒక భామామణి ఈ విషయం వెంకాయమ్మగారితో చెప్పింది. అసలే అవకాశాని కొక్కుసుక్కుచున్న వెంకాయమ్మగారు రత్తమ్మగారింటికి నిప్పుకెళ్లారు, వెళ్ళి "మాశావా? రత్తమ్మొదినా! రాత్రేం జరిగిందో, అందుకనే నేనా సూరేకాంతంగారి యింటికెల్లం మానేశాను అంది.

"ఏం టొదినా? ఏం జరిగింది,"

"ఏం చెప్పనూ! చెప్పాలంటే నీ కెంత కోపమొస్తుందో తల్చుకుంటే నా వొళ్లు మండుతోంది."

"అస లేంటో చెపుదూ!"

"ఏముందీ, మా అన్నయ్య అర్ధరాత్రివేళ దొవరితోటో మాటాడాడట, నువ్వు చూశావట, ఇంటికొచ్చాక యిలాగైతే ఎలాగన్నావట, మా అన్నయ్య నీ కెందుకని నాలుగు తన్నేడట, నువ్వు చీపురుకట్టుచ్చుకున్నావట. ఇద్దరూ కొట్టుకుంటూంటే ఆవిడ చూసిందట. విన్నావా!" ఆ సూరేకాంతం ఎలాంటిదో, ఇలాటి మాట నలుగురిలో అంటుందా? అక్కణ్నుంచి అంతా నవ్వులూ గుసగుసలూ ఎన్నో యిందాలాడిపోసుకున్నారంట. యినలేక లేచొచ్చి ఒకావిడ నాతోటంది. పొటిమనిషినిలాంటి మాలంటుందా? నీ మీద యిష్టంమూలాన ఆగలేక నీ తోటి చెప్పా. ఆవిడ కాపొంగ లేంటి చెప్పు."

ఆ కలహ వృక్షానికి చిలవలు పలవలు మొలిచాయి. "ఇప్పుడే కనుక్కుంటానుండు" అంది రత్తమ్మగారు సూరేకారం పాలు ఎక్కువయి. ఆ త్రిపురాసురమర్దనీ ఆకారాన్ని చూసి లోలోపల సంతోషిస్తూ "నే వన్నానని చెప్పకు సుమీ. మా వారు మంచారు కారు" అంది వెంకాయమ్మ. "నేనంత తెలివి తక్కువదాన్నా?"— "అయితే వెళ్ళొస్తా వొదినా! కావలిస్తే దానవు కనుక నువ్వెడంచేత్తో పెడితే నే కుడిచేత్తో తింటా గనక, నీకూ నాకూ ఎరమరిక లేదు కనక చెప్పాను. నా ఊసు తేకు సుమీ" అని నిప్పు తీసుకోకుండానే వెళ్లింది.

వెంటనే రత్తమ్మగారు "పవమాన మానస తిరస్కారత్వరాహంకృతిః" సూరేకాంతంగారింటిమీద పడింది. సూరేకాంతం యివతలకొచ్చిందో లేదో భారతం విప్పింది. "అమాసనాడ కొట్టావా? పున్నంనాడు బూరెట్టావా? నువ్వన్న మాటలన్నీ నే పడతా ననుకున్నావా? యీ రత్తమ్మంటే యేవరనుకున్నావ్ — నువ్వూ నీతోటి తిరిగే కుక్కలూ, మొరిగే మొరుగులు నా కినపడ వనుకున్నావా? నా మొగుడూ నేనూ కొట్టుకోటం నువ్వు చూశావా? మా కేకలు నువ్వివిన్నావా? ఇలాంటి పనికిమాల్న పేలాపన ఇంకోసారి పేలు; నీ పరువు ఎంతుందో నే చూస్తాను" అని ఇంకా ఏమన్నా ఆవిడ సమాధానం చెపుతుందేమో దానికి సమాధానం చెబుదామనైతే యేం, కాస్త రెస్టు తీసుకుందామనయితే యేం ఆగింది. కాని ఆవిడ సమాధానం చెప్పే స్థితిలో వుంటేగా, "చలి పిడుగులాగా అమాంతం మీదపడి వాగ్వర్షం కురిపిస్తూంటేనూ, మాటాడితే ముష్టియుద్ధానికి ఢీకొడానికి సిద్ధంగావున్న ఆవిడ "పోజు" చూస్తేనూ నోటంట మాట రాలేదు - కాని రత్తమ్మగారింతటితో నిరాశపడిపోయే రకంలో చేరదలుచుకోలేదు. "నువ్వూ, నీ మొగుడూ దెబ్బలాడారేమో మీ అమ్మ, నీ చెల్లెళ్లు, నీ [illegible] నీ అత్తత్త, నీ అమ్మమ్మ కొట్టారేమో మొగుళ్లని, దేవుళ్లనీ స్నానాలనీ ముతాల్లాగా పోగయి ఊళ్లో వాళ్ల ఊసెందుకంటు; జాగర్త, యేమనుకున్నారో, అని" తాటంకాచలనంబుతో, భుజనటద్ధమ్మిల్ల బంధంబుతో' అనేసి విసవిస వెళ్లింది.

ఇంట్లో కొచ్చారు సూర్యకాంతంగారు, వెంటనే తన ఫస్టువార్నింగ్ విషయం రామారావుగారెత్తితే పాపం ఆ 'మానవతి' యేంచేస్తుంది చెప్పండి? దీంతోటి వాళ్లకి పోటుకొచ్చింది భర్తకి సమాధానం చెప్పి ఏకాశీ ఉపవాసంతోటి నీరసంగా ఉందేమో గోడకి చార్లబడి పొయ్యి ముంచెడుతోంది సూరేకాంతం. రామారావుగారు మాత్రం సూరేకాంతానికి వినబడేలాగ పక్కగదిలోంచి "నే చెప్పేదు స్నానాలు చెయ్యొద్దనను, పూజలు చెయ్యొద్దనను, నేనేం నాస్తికుణ్ని కాను. కాని భక్తి పేరు చెప్పి వెధవపనులు చెయొద్దంటాను. ఎవరిష్టం వారిదికదా అని, పరువుకి దేహానికి అనారోగ్యకరమైనవి చెయ్యొద్దంటాను. పుణ్యం సంపాయిస్తామని తయారయి, సమావేశమయి ఇతరుల దోషాలు ప్రసారిస్తే ఉన్న పుణ్యం గంగాయాత్ర చేస్తూందంటాను,' అని అంటూ వంటగదిలోకి వెళ్లారు. ★

# నాయనమ్మ

శ్రీమతి ఆదుర్తి బాల

సాయంకాలం వీధుల్లో పిల్లలంతా ఆడుకుంటున్నారు. వాళ్ళ ఆటలు చూస్తూ వీధుల్లో నుంచున్నా. నిజంగా బాల్యదశ ఎంతసుఖమైనది. అప్పుడున్న ఆనందం, శాంతి, సౌఖ్యం అసలింక జీవితంలో లేనేలేవు అని అనుకుంటున్నా. ఇంతలోనే పద్మ "అక్కా," మరేం, ఏనాదిలక్ష్మి పడిపోయింది ఒంటినిండా దెబ్బలే" అంటూ రివ్వున యింట్లోకెళ్లి కొబ్బరినూనెసీసా పుచ్చుకుని పరుగెత్తింది. పిల్లలమనస్సు ఎంతసున్నితమైనది "నిజంగా నా పద్మా" అంటూ వీధిఅరుగు మీదకెళ్లి చూస్తున్నా. పద్మ దానిఒంటి నిండా నూనెరాసింది. పిల్లలంతా కలిసి దాన్ని మెల్లిగా లేవదీసి వాళ్ళయింటికి తీసుకెడుతున్నారు. పిల్లల్లో ఎంత జాలుంది, వీళ్ళు, వాళ్లు అని లేదుకదా, పెద్దవాళ్ళయితే అది ఏనాద్ది, మనము ముట్టుకోకూడదని వచ్చేస్తారు. అంతేకాని "అయ్యో పడ్డావా" అనేనా అనరు. పిల్లల్ని నిజంగా పెద్దవాళ్లే పాడుచేస్తున్నారు. ఆచారముల పేరుతో వాళ్ళలోని జాలి, ప్రేమస్వభావాలను నాశనం చేస్తున్నారు. అని అనుకుంటున్నా. ఇంతలో నాయనమ్మ వచ్చి "ఏమిటే పద్మ అంటూంది" అంది. "ఏంలేదు నాయనమ్మా ఏనాదిలక్ష్మి పడిందట చెప్పటానికొచ్చింది" అన్నా. "ఊ (హుఁ" అంటూ వెళ్లింది నాయనమ్మ. ప్రసంగం చప్పున ముగిసిందని సంతోషపడ్డా. ఇంతలో పద్మ వచ్చి" అక్కా మరేం, లక్ష్మి పడిపోయింది..." అని ఏదో చెప్పబోతూంటే "ఉస్ నాయనమ్మఉంది" అన్నా. పద్మ నిమ్మళంగా అంతా చెప్పింది. మోకాలు మీద చర్మంఅంతా చెక్కుకుపోయిందట పాపం అనుకున్నా.

అది వేసంకాలము. అందుకని అందరము డాబామీదే పడుకునేవాళ్ళం, మేమంతా డాబామీదకూర్చున్నాం. అన్నంతిని. పద్మకి అస్తమానులక్ష్మి గొడవే, నాయనమ్మ విసుక్కుని "అస్తమానూ ఏనాదివాళ్ళమాట తలపెడితే పాపం వస్తుంది" అంది. "పాపం, అంటే ఎల్లాగుంటుంది నాయనమ్మా" అన్నాడు మా క్రిష్ణ. "పాపంఅంటే తెలీదా, ఓరి చవటా! పాపంఅంటే అదొక గాలిస్వరూపము, పెద్ద, పెద్ద, గోళ్లు, కోరలుకలిగి చాల భయంకరంగా ఉంటుంది. అస్తమానూ ఏనాదివాళ్ళ మాటలుతలపెడితే పాపం దానిగోళ్లుపెట్టి పీకుతుంది తెలుసా" అంది. "బాబోయ్" అంటూ క్రిష్ణ ముసుకు తన్ని పడుకున్నాడు. ఇల్లాగే పిల్లలకి పిరికితనం నేర్పడమనుకున్నా, కాని ఏంచెయ్యను! నాయనమ్మ మాటకి సమాధానం చెపితే ఇంకేమన్నా ఉందా. నాన్న కొరడాతీసుకుంటారు. మళ్ళీ మొదలెట్టింది నాయనమ్మ "పద్మా. నువ్వా లక్ష్మిని ముట్టుకోలేదుకదా." అంది. పద్మ నిజంచెప్పడానికి తడబడుతోంది. క్రిష్ణ నిజంచెప్పబోతుంటే వాడి నోరు గట్టిగా నొక్కాను. వాడు కిక్కురుమనకుండా పడుకున్నాడు. "ముట్టుకుంటే ఏం నాయనమ్మా" అందిపద్మ. "ఓసీ, ముట్టుకుంటే ఏమీఅంటావేమే ఇంకేమన్నాఉందా ముందర నీకు ప్రాయశ్చిత్తముచెయ్యాలి. ఇంట్లోఉన్న సామానంతా తడపాలి. మనమంచి, మర్యాదా, అంతా మంటకలవవలసిందే" అంది. "ప్రాయశ్చిత్తమంటే ఏమిటి నాయనమ్మా?" అన్నాడు మా క్రిష్ణ ముసుగులోంచే. "ప్రాయశ్చిత్తమంటే తెంపలేసుకుని నూటపాతిక గుంజీలు తీయడంరా, మొన్న బళ్ళో చూశ్ళేదు సుబ్బారావు చేస్తుంటే అదేమిటంటే ప్రాయశ్చిత్తమని చెప్పారుకదూ మేష్టారు" అంది పద్మ. "అదికాదే చవట పెద్దమ్మారా! అట్లగరిటికాల్చిబాగ, నాలికమీద వాతపెట్టడం ప్రాయశ్చిత్తమంటే" అంది నాయనమ్మ. "బాబోయ్. వాతే"అన్నారు పిల్లలిద్దరూ, "ఊఁ ఏమిటనుకున్నావు లేకపోతే ఆవుపేడ తినాలంది" నాయనమ్మ. "ఛీ, ఆవుపేడా" అన్నారు పిల్లలు. నాకు చాలఅసహ్యం వేసింది నాయనమ్మ మాటలు వింటూంటే. పాపం అమాయకులైన పిల్లల హృదయాలలో ఈలాగే పిరికిమందు నూరిపోస్తారు పెద్దవాళ్లు. పిల్లలు పెద్దయినా పిరికితనంపోదు. అప్పుడు మళ్లా ఆపెద్దవాళ్లే "మా అబ్బాయికిభయం. వీడేకాదు. వీడినాన్న, తాత, ముత్తాతఅంతా యింతేనమ్మా" అంటారు. అనుకుంటున్నా. యింతలో "ఎంత పేడతినాలి నాయనమ్మా" అంటున్నాడు మా క్రిష్ణ. "ఎంతేమిటి కొబ్బరికాయంత" అంది నాయనమ్మ నవ్వుతూ. "అమ్మయ్యో కొబ్బరికాయంతే" అన్నారు పిల్లలు. వాళ్లు చాల భయపడిపోయారు." అయితే, నాయనమ్మ ఏనాదిదాన్ని ముట్టుకువచ్చి అన్నీ ముట్టుకుంటే, తడపాలన్నావుకదా! మరి, పరుపులు పందిరిమంచాలు బీరువాలు, అందులో బొమ్మలు నాన్న కాగితాలు అన్నీ తడుపుతారా?" అంది పద్మ. "చవటా అవన్నీ తడపరు. వాటిమీద పసుపునీళ్లేనా, పేడనీళ్ళేనా జల్లుతారు! అంది నాయనమ్మ." అదికాదేపద్మా! తడపటానికి వీలుగాఉన్నవి తడుపుతారు. వీలుగాలేనివి తడపరు. అదీగాక కొన్నింటిని పూర్తిగా తడిపితేగాని శుద్ధి అవ్వ, కొన్నింటిమీద నీళ్లుచల్లితే శుద్ధి, కొన్నింటిని, అదీ, ఇదీ, కూడచెయ్యకుండానే శుద్ధిఅవుతాయి. ఇదేం, పక్షపాతం ఆచారము నాయనమ్మా" అన్నాను అప్పటికి కొంచము ధైర్యము తెచ్చుకుని. అనుగో, నాయనమ్మకి రానేవచ్చింది కోపం, "నువ్వూరుకో, నిన్నెవరు చెప్పమనలేదు ఇదేమిఖర్మో కాని యిప్పటికాలం. పిల్లలంతా యింతే. చెట్టవేదాంతాలు, అందుకే కాలంయిల్లా ఏడుస్తోంది" అంటూ మాట్లాడకుండా పడుకుంది. తరవాత అమ్మ నన్ను

(39-వ పేజీ చూడండి)

# బొమ్మరిల్లు



## చంద్రుని పరుగు



శ్రీ కోనంఘోట్ల కృష్ణమూర్తి

బాలుడు:

అమ్మా చంద్రుడు ఆకాశంలో
ఆగక పరుగిడు నెందులకు?
మేఘములన్నిటి మెల్లగ దాటి
ముందుకు సాగున దెందులకు?

తల్లి

ప్రపంచమంతా తిరిగివచ్చుటకు
ప్రొద్దు చాలదను భయమేమో
అందుకె చంద్రుడు వేగముతోడ
ముందుకు పరుగిడు చున్నాడు.

బాలుడు:

అదికాదమ్మా అదికాదు
అందుకు కారణ మదికాదు

* * *

నాన్నా చంద్రుడు ఆకాశంలో
నిలువక పరుగిడు నెందులకు?
అమ్మచెప్పినది సరిగా లేదు
నమ్మడాని కది శక్యంగాదు.

తండ్రి

పరుగిడుచున్నది చంద్రుడుకాదు
పరిశీలింపుము మేఘములే
పరుగిడుచున్నవి; ఈదిశవైపే
ప్రభావమంతా వాయువుదే.

బాలుడు

ఇంతకన్న అమ్మచెప్పిందే బాగు
ఇది నమ్మడానికి నాతరం కాదు

* * *

తాతా చంద్రుడు ఆకాశంలో
తొందరతోడను పోనేల?
అమ్మానాన్నా చెప్పినవన్నీ
అబద్ధాలుకాదా తాతయ్యా?
ఎవరికి చంద్రుడు భయపడ్డాడు?
ఎవరు తరిమారు? ఏమిజరిగింది?

తాత

కాదు నాయనా అది కాదయ్యా
కారణమందుకు అది కాదయ్యా
ఆపై మెరసే తారల చూడు.
అవియన్నియు చంద్రునితోడు.
నేస్తములౌ ఆ చుక్కలతోడ
నిత్యము చంద్రుడు ఆటలనాడు
దాగుడుమూతల నాడుచున్నారు
మేఘము చాటున దాగుచున్నాడు.

బాలుడు

సరిగా చెప్పావు తాతయ్యా
సత్యమంతేయగు తాతయ్యా

తాత

అనుదినము నీ మిత్రులతోడ
ఆటలనాడుము అబ్బాయీ
ఆడిన కలుగును ఆరోగ్యం
ఆరోగ్యమే మహాభాగ్యం.

# సముద్రపు గుఱ్ఱము

బ్రహ్మాండంలో సృజింపబడిన జంతువులలో కెల్లా సముద్రపు గుఱ్ఱం చాలా విచిత్రమైంది. ఇది చేపల జాతికి చెందినది. దీని తల గుఱ్ఱపుతల. తోక విలు వంపుగా ఉంటుంది. పొట్ట గూన పొట్ట. ఇది తన తోకతో కోతివలె దేనినైనా చుట్టబెట్టుకో గలదు. ఊసరవెల్లివలె తన శరీరచ్ఛాయను మార్చుకొనుచు, శత్రువుల బారి నుండి తన్ను రక్షించుకో గలదు. దీని కన్నులు మరీ అబ్బురమైనవి. రెండు కన్నులను ఒకే సమయంలో చెరోవైపుకు త్రిప్పుకోగలదు. ఇది నీటిలో నున్నప్పుడు ఒక కన్నుతో నీటి ఉపరిభాగాన్ని, రెండో కన్నుతో నీటి క్రిందిభాగాన్ని కూడాచూడగలదు. ఈవిడ్డూరమైన ఆకారానికి సాయం, మగజంతువుకి "కంగారూ" కున్నట్లుగా ఒక పిల్లల సంచికూడా ఉంటుంది.

ఈ సముద్రపు గుఱ్ఱాలు శీతల సముద్రాలలో తప్ప తక్కిన అన్ని సముద్రాలలోను ఉంటాయి. మన హిందూ మహాసముద్రంలో విరివిగా ఉన్నాయి. వీటిలో అనేకజాతు లున్నాయి. కొన్ని మరీ చిన్నవి. అంగుళమంతే ఉంటాయి. కొన్ని అడుగు పొడుగు కూడా ఉంటాయి.

సముద్రపు గుఱ్ఱం శరీరమంతా ఎముకవలె గట్టిగా ఉండే బిళ్ళలతో నేర్పరుపబడిన కవచంతో కప్పబడి ఉంటుంది. ఇట్టి కవచంతో అది నిలువుగా నిలువబడి, తన వీపు మీద విసనకఱ్ఱలా ఉండే రెక్కను ఇటు అటు విసరుకుంటూ ఈదుతోంటే, దాని సోయగం చూచి తీరవలసిందే! అది నిట్ట నిలువుగా నుండియే ముందుకు వెనుకకు, పైకి క్రిందికి, దానివీపు రెక్కను కదుపు కుంటూ పోగలదు.

దీని ఆహారం, సముద్రంలో అటూఇటూ తిరిగే మిక్కిలిసూక్ష్మమైన జంతువులు, మొక్కలూనూ. ఇవి జీవించి తిరుగుతూన్న వాటి నేగాని చచ్చినవాటిని ముట్టుకోవు.

వర్ణం మార్చుకొని శత్రువుల నుండి తప్పించుకోటంలో ఇవి చాలా నేర్పుకలవి. సముద్రాల్లో కొండల ప్రక్క నున్నప్పుడు గోధుమ వర్ణం ధరించి రాళ్ళల్లా కనపడగలవు. అవి సముద్రపు మొక్కలలో నున్నప్పుడు మనం ఎంతబాగా పరిశీలించినా అవి కనపడవు; అవి అచ్చంగా ఆమొక్కల్లాగే మారి పోతాయి.



వీటి ప్రేమగాథలు, గ్రుడ్లు పెట్టటం, పొదగడం, పిల్లల్ని పోషించడంకూడా విచిత్రంగానే ఉంటాయి. ఋతుకాలంలో మగగుఱ్ఱం, ఆడుగుఱ్ఱం-ఒకదానివెనుక నొకటి ధ్వని చేసుకుంటూ, ఈదుతూ నాట్యం చేస్తాయి. ఈ నాట్యం రమారమి రెండు రోజులు సాగుతుంది. ఆతర్వాత ఆడగుఱ్ఱం మగగుఱ్ఱంవెంటబడి దాని పిల్లల సంచిలో గ్రుడ్లు చేరుస్తుంది. ఈ



# జోళ్ళ షాపు

శ్రీ అండ్రభాస్కర సుబ్బారావు

మా ఊరిలో వున్న వెంకట్రావు గారి అబ్బాయి సూర్యం గాడు వట్టి మొద్దువెధవ. స్కూలు ఫైనలు 3 ఏండ్లుపోయింది. చదువు మీద ఆశవదలుకున్నాడు. ఏదో వాళ్లనాన్న కొన్నాళ్ళు గుమాస్తా పనిచేసి రిటైర్ ఐ పోయాడు. సూర్యం గాడికి 20 ఏండ్లు. ఎంత సేపూ తిని ఊరుమీద తిరగడం తప్ప యింకో పనిలేదు.

ఈ ఊరిలోనే పేర్రాజుగారు అనే జమీందారుగారు వున్నారు. అతనికిఒక్కతెకూతురు. పేరుకమల. కమల స్కూలు ఫైనలు ప్యాసు అయి ఇంటర్ చదువుతోంది. పేర్రాజుగారు కమల కోరినదల్లా యిస్తూవుండేవారు. కమల రాత్రి 8 గం. వీధి అరుగుమీద కూర్చోడానికి రాగానే సూర్యం అలావచ్చి ఆమె ప్రక్క చూడగానే రోషంతో ఆమె తన కాళ్లనున్న జోళ్ళు విసిరేసిది. తండ్రికి తెలియకుండా క్రొత్తవి కొనుక్కునేది. ఇలా సూర్యం రావడం కమల జోళ్ళు విసరడం ప్రతీరోజు జరుగుతుండేది. ఒకరోజున తండ్రిని జోళ్ళుకొనమనగానే "క్రిందటి వారం కొన్నా అప్పుడే పోయాయా" అన్నాడు. "లేదండీ, నాన్నా మాస్కూలులో ఎవడో స్టూడెంట్ అల్లరి పెట్టడానికి ఎవరూ లేనప్పుడు వైటింగ్ రూములో కొచ్చి తీసుకుపోయిఉంటాడు" అని అంది. సరేనని క్రొత్తజతకొన్నాడు.

ఒక రోజున ఆమె 5½ గం॥ సాయంత్రము కమల, స్నేహితులతో స్కూలునించి వస్తూవుంటే సూర్యం నవ్వి "హలో! జానీవ్" అన్నాడు. వెంటనే కమల కొత్త జోళ్ళు విసిరి వెయ్యగానే అందరు రోషంకొద్ది జోళ్ళుతీసి వాడి మొహానికి కొట్టారు. సూర్యానికి 10 జతలు దొరికాయి. ఉ ప్పొంగి పోయాడు. కమల 8 గం॥ రాత్రి వీధి అరుగు మీద వుండగా సూర్యం "ప్రేసీ! అనుగ్రహం ఎప్పుడు" అనగానే "ఉండు అనుగ్రహిస్తాన"ని కమల ఇంట్లోకి వెళ్ళి పుట్టిననాటి నించి తను తొడుక్కున్న జోళ్ళు అన్నీ బుట్టలోపెట్టి విసిరేసింది. ఆనందంతో ఇంటికి వెళ్ళి చిన్న జోళ్ల షాపు పెట్టాడు. అలాగే పెద్ద షాపు పెట్టి డబ్బు గణిస్తూవుండేవాడు.

వెంకట్రావు ఒకరోజున జమీందారు వద్దకు వచ్చి "ప్రభూ! మీ దయవల్ల మా సూర్యం జోళ్లషాపు పెట్టి సుఖంగా వున్నాడు" అన్నాడు.

"నాదయ యిందులో ఏమీ లేదండీ"

మీదయ అంటె మీఅమ్మాయి దయ. మీ కమల విసిరిన జోళ్ళు బట్టే మా వాడు గొప్ప వాడయ్యాడు. వాడి ప్రేమఫలితం, మీఅమ్మాయి ఆదరణవల్ల మేము కులాసాగా వున్నాము. సూర్యం లక్షాధికారై పెద్ద జోళ్ల షాపు పెట్టాడు. కమలకి జోళ్లు కావలసినపుడు సూర్యం కొట్టులోనే కొనుక్కునేది." ★

---

ప్రకారం కొన్ని వందల గ్రుడ్లను ఆడగుఱ్ఱం మగగుఱ్ఱానికి అప్పజెప్పి స్వేచ్ఛగా తిరిగిపోతుంది. ఇక తల్లి గుఱ్ఱానికి సంతానమునుగూర్చిన జిజ్ఞాసయే ఉండదు. గ్రుడ్లన్నియు మగ గుఱ్ఱం యొక్క సంచీలో పొదగబడి పిల్లలవుతాయి. మగ గుఱ్ఱం రమారమి 45 రోజులవఱకు తన సంచిలోని పిల్లల్ని జాగ్రత్తగా పెంచుతుంది. పిమ్మట వానిని స్వతంత్ర జీవనానికి నీటిలోవదుల్తుంది.

సముద్రపు గుఱ్ఱాన్ని సారాలో నిలువచేస్తే కాలకూటంలాంటి విషం తయారవుతుందనీ, వీటిని కాలిస్తే వచ్చిన బూడిద ఇతర విషములకు విఱుగుడుగా పనిచేస్తుందనీ, బట్టతల పోగొడుతుందనీ-ఇంకా ఇంకా ఎన్నో అభిప్రాయాలు పురాతనకాలం నుంచీ ఉన్నాయి. కాని అవి నమ్మతగ్గవిగా మాత్రం కనపడవు. ★

# హకల్ బెరీ ఫిన్

## మార్క్ ట్వేన్

బొమ్మరిల్లు సీరియల్

### 8

నేను లేచే టప్పటికి బాగా పొద్దెక్కింది. సుమారు ఎనిమిదిగంటలై వుంటుందనుకున్నాను. హాయిగా పచ్చికపై చల్లటి చెట్లనీడలో పడుకుని, నేనింతవరకు చేసిన పనిని, చెయ్యబోయే పనినిగూర్చి ఆలోచిస్తున్నాను. నేను పడుకున్న చోట సూర్యకాంతి పడటం లేదు. చల్లగాలికి చెట్లఆకులు కదిలినప్పుడల్లా అక్కడక్కడ ఒక్క రవ్వ సూర్యకాంతి కనిపించినట్టే కనిపించి మాయమవుతూంది. నాకు రెండు గజాల దూరంలో కొన్ని ఉడతలు వెనక కాళ్లమీద కూర్చుని స్నేహపూర్వకంగా చూస్తున్నాయి. చాలా బద్ధకంగా వున్నది. లేచి వంటప్రయత్నం చెయ్యటమా, మానటమా అని సందేహం వచ్చింది. కాని లేకుండా అలాగే పడుకున్నాను.

అంతలో దూరాన నదిమీద నుంచి "గుంయ్" మనే శబ్దం వినవచ్చింది మోచేతులమీద లేచి విన్నాను. మళ్ళీ కాస్సేపటికి అదే శబ్దం వచ్చింది. గబుక్కున లేచి నది ఒడ్డువరకూ వెళ్లి చూశాను. వెంటనే అంతా అర్థమయింది. ఒకపడవ, అందులో చాలామంది మనుష్యులూ ఏదో హడావిడిగా పని చేస్తున్నారు. "గుంయ్" మని శబ్దం వచ్చినప్పుడల్లా తెల్లటి పొగ పడవచుట్టూ వ్యాపిస్తున్నది. నాశవం కనిపిస్తుందేమో నని, అడుగున ఎక్కడన్నా వుంటే పైకి తేల్తుందని నీళ్లలోకి ఫిరంగి పేలుస్తున్నారు.

నాకు బాగా ఆకలయింది. కానీ యిప్పుడు మంటచేసి వంట తలపెట్టటం అపాయకరమనుకున్నాను. ఎందుకంటే ఎవరూ వుండని జాక్సన్ ద్వీపంలోనుంచి పొగరావటం చూస్తే వాళ్లు అనుమానపడవచ్చు. అంచేత ఒడ్డునే కూర్చుని అటువైపే చూడసాగాను. నది అక్కడ ఒకమైలు వెడల్పున్నది. వేసవికాలం పొద్దుటివేళ నదీదృశ్యం చాలా అద్భుతంగా వుంటుంది. కాని ఆకలవుతున్నందువల్ల వూరికే ప్రకృతిని చూస్తూ కూర్చోటం ఏమీ తృప్తిగా లేదు. ఇంతలో నాకో సంగతి జ్ఞాపకం వచ్చింది. నదిలో ఎవరన్నా మునిగిపోయినప్పుడు రొట్టె ముక్కలలో పాదరసం వుంచి నీళ్లమీద ఒదిలిపెడతారు. ఆ రొట్టె ముక్కలు పోయిపోయి మనిషిశవం ఎక్కడవుందో అక్కడ చటుక్కున ఆగిపోతాయి. అప్పుడు అక్కడికి వెళ్లి శవంకోసం గాలాలూ అదీ వేసి బయటికి తీస్తారు. ఇప్పుడు కూడా అలాచేస్తే ఆ రొట్టెముక్కలు నదివాలులో నాదగ్గరకు కొట్టుకువచ్చి ఆగుతయ్యని అప్పుడు వాటిని తినవచ్చని, ఆలోచన తట్టింది.

కొంతసేపు ఎదురు చూశాను. చివరికి నేననుకున్నట్టే ఒక రొట్టెముక్క తేలుతూ వచ్చింది. గబుక్కున నీళ్లలోదూకి పట్టుకోబోయాను. కానీ అది అందకుండా లోతుకు తప్పించుకుపోయింది. కొంతసేపటికి యింకొకటి వచ్చింది. యీసారి దాన్ని పట్టుకున్నాను. పాదరసం దులిపేసి ఆ రొట్టెముక్క కబళించాను.

రొట్టెముక్క అయిపోయాక చుట్టతీసి వెలిగించాను. ఆ పడవ మెల్లిగా జాక్సన్ ద్వీపం కేసి వస్తోంది. అంచేత నేను ఒడ్డునేవున్న ఒక గుబురుచెట్టెక్కి కూర్చున్నాను ముందే తెలిస్తే తప్ప నేనా ప్రాంతాల్లో వున్నట్లు దేవుడుకూడా కనిపెట్టలేడు. పడవ దగ్గరకు వస్తే అందులో ఎవ రెవరున్నారో స్పష్టంగా కనిపెట్టాలని అనుకున్నాను.

పడవ దగ్గరకి వచ్చింది. మావాళ్లందరూ దాంట్లోనే వున్నారు. మానాన్న, జడ్జీ థాచర్, బెకీథాచర్, జోహార్పర్, టామ్‌సాయర్, వాళ్ల పెద్దమ్మా, సిడ్, మేరీ, యింకా ఎందరో వున్నారు. ప్రతివాళ్లూ నాచావుని గురించే మాట్లాడుతున్నారు. పడవయజమాని యిలా అన్నాడు:

"నది యిక్కడ అట్టే వడిగా లేదు. బహుశా శవం వచ్చి యిక్కడెక్కడో ఆగిపోయి వుంటుంది. యీ ఒడ్డున వెదికితే కనిపించవచ్చు. జాగ్రత్తగా వుండండి అందరూ" అని అంటూ నీళ్లలోకి ఫిరంగి పేల్చాడు. ఫిరంగి నేనున్న చెట్టుకు అతి సమీపంలో పేలింది. అందుచేత కొంతసేపటిదాకా ఆ పొగలో ఉక్కిరి బిక్కిరయ్యాను. ఆ చప్పుడు విన్న భయంతో అసలు చచ్చిపోయాననే అనుకున్నాను

పడవ యింకా ముందుకు పోయింది. ద్వీపం

అవతలపక్కగా చుట్టుతిరిగి మాయమయింది. అలా ఒకగంట సేపటిదాకా వుండి వుండి ఫిరంగిమోత విని పిస్తూనే వున్నది. అప్పటికి ద్వీపం చుట్టూరా వెదకటం అయిపోయిందని, యింక వాళ్లు వెళ్లిపోవచ్చనీ అనుకున్నాను. కాని వాళ్లు తమ ప్రయత్నం వదలలేదు. మళ్ళీ నేనున్న చెట్టుదగ్గఱదాకా వచ్చారు. తిరుగు ప్రయాణంచేస్తూ మళ్ళీ ఫిరంగి పేల్చుకుంటూ బయలుదేరినచోటికే వెళ్లిపోయారు.

నాకు గండం గడిచిపోయింది. నాకోసం యింకెవరూ వెదకరు. నా పడవలోనుంచి సామానులన్నీ తీసుకుపోయి ద్వీపంమధ్య అరణ్యంలోకి చేరేశాను. కంబళీలతో చక్కటి గుడారం కట్టాను. కొంతసేపు చేపలు పట్టాను. పొద్దు పడమటికి తిరిగినతర్వాత మంటచేసి చేపలు వండాను. భోజనమయింతరవాత మంట పక్కనే కూర్చుని చుట్ట కాలుస్తూ గడిపాను. చీకటి పడింది. చీకటి వ్యాపిస్తున్నకొద్దీ ఏదో చెప్పలేని దిగులు ఎక్కువ కాజొచ్చింది. కొంతసేపు నది ఒడ్డున కూర్చున్నాను అలలుచేసేశబ్దం వింటూ. కొంతసేపు నక్షత్రాలు లెక్కపెట్టాను. మరి కొంతసేపు నదిలో ఎన్నికొయ్యదుంగలు కొట్టుకెడుతున్నాయో లెక్కపెట్టాను. తరవాత ఏం చేయాలో తోచలేదు. నిద్రపోతేనైనా తోస్తుందేమోనని నా డేరాకి పోయి నిద్రపోయాను.

మూడు పగళ్లూ మూడు రాత్రులూ యిలా గడిపాను. ఒకరోజుకీ యింకో రోజుకీ తేడా ఏమీ లేదు. నాదిగులు తగ్గలేదు. చేసేందుకు పని ఏమీ లేకపోవటంవల్ల వంటరితనం మరీ బరువయింది. నాలుగో రోజున ద్వీపమంతా ఒకసారి పరిశోధించి చూడాలని బయలుదేరాను. ఈ ద్వీపమంతా నాదే నేను దీనికి రాజుని. అందుచేత దీన్నిగురించి పూర్తిగా తెలుసుకోవలసి వుందనుకున్నాను. కానీ అదికాదు అసలు కారణం. ఈవిధంగానైనా పొద్దు పోతుందని లోపలి ఉద్దేశ్యం. ద్రాక్షచెట్లూ, నేరేడుచెట్లూ, చాలా కనిపించాయి. వాటినిండా కాయలు సమృద్ధిగా వున్నాయి. కానీ తినటానికి మాత్రం వీల్లేకుండా వగరుగా వున్నాయి. కాలక్రమేణా అవే పండుతాయని అప్పుడు హాయిగా ఒక్కణ్ణే తినవచ్చనీ అనుకున్నాను. అలా పోయిపోయి ద్వీపం అవతలి చివరకు చేరుకున్నాను. చేతులో తుపాకీ వున్నది. కాని యింతవరకూ పేల్చలేదు. ఎందుకైనా మంచిదని తెచ్చుకున్నాను కాని పక్షుల్ని వేటాడ్డానికి కాదు. తెచ్చుకున్నందుకు మంచిదే అయింది. ఎందుకంటే హఠాత్తుగా ఒక పెద్దపాము ఎదురయింది. తుపాకీ ఎత్తి పేలుద్దామనుకున్నాను. నా ప్రయత్నం గ్రహించి అది పొదల్లోకి తుర్రున పారిపోయింది. దాన్ని వెంబడిస్తూ కొంత ముందుకు పోయాను. హఠాత్తుగా మరొక ఆశ్చర్యకరమైనది ఎదురయింది. ఇంకా కొద్దిగా నిప్పు రాజుకుంటున్న నెగడు ఒకటి కనిపించింది. దాన్ని చూడగానే ఒళ్లు ఝల్లుమని జడుసుకున్నాను. వెంటనే అటూ ఇటూ చూడకుండా వచ్చిన దోవనే పరుగెత్తాను. మధ్య మధ్యలో ఆగి ఏమన్నా వినిపిస్తుందేమోనని విన్నాను. ఏమీ వినిపించలేదు. ఎవరూ కనిపించలేదు. నాడేరాకు వచ్చేశాను. ఇంకా యిక్కడ తారట్లాడటం అపాయం

అనుకున్నాను. డేరా వూడదీశాను. సామానంతా మళ్ళీ పడవలోకి చేర్చేశాను. మంట ఆర్పేశాను. బూడిద కనుపించకుండా చుట్టూ వెదజల్లాను తరవాత ఒక చెట్టెక్కి కూచున్నాను.

అలా ఒక రెండు గంటలు గడిచింది. ఏమీ వినిపించలేదు. ఎవరూ కనిపించలేదు. అయినా ఆ రెండు గంటల్లో రెండు వందల సార్లయినా ఏదో విన్నట్టూ ఏదో కన్నట్టూ ఉలిక్కిపడ్డాను. కానీ ఎంతసేపలా చెట్టుపై కూర్చోగలను కిందకి దిగాను. ఆవేళల్లా యిక మంట చేయలేదు. పొద్దున వండినదాంట్లో మిగిలినదే తిని పచ్చివైనా ద్రాక్షపళ్లే కాసినితిని మంచినీళ్లు తాగి వూరుకున్నాను.

రాత్రిపడింది. మళ్లీ ఆకలేసింది. అప్పటి కింకా చంద్రుడుదయించలేదు. పడవ యెక్కి ఇల్లినాయిస్ రాష్ట్రంవైపు ఒడ్డుకు బయలుదేరాను. నది పావుమైలు వెడల్పు మాత్రమే వున్నందున త్వరలో

ఒడ్డుకు చేరాను. అరణ్యంలోపలదాకా పోయి చెట్ల మధ్య మంటచేసి భోజనం కానిచ్చాను. కొంతసేపు విశ్రాంతి తీసుకుందామనుకుంటుండగా ఏదో అలికిడి వినవచ్చింది. గుర్రాల అడుగుల చప్పుడు, మనుష్యుల మాటలు వినపడ్డాయి. తొందర తొందరగా నాసామాను పడవలోకి చేర్చి ఆ వచ్చినవాళ్లెవరో చూద్దామని మళ్ళీ వెనక్కెళ్లాను. ఒకచోట దాక్కున్నాను. ఒక గొంతి కంటున్నది: "యీ రాత్రికి యిక్కడవుందామా? గుర్రాలు బాగా అలిసిపోయాయి. కాస్త వీలుగావుండే చోటు చూద్దాం పద"

ఇంక అక్కడ వుండటం అనవసరం అనుకుని పడవ దగ్గిర కొచ్చాను. పడవలోనే పడుకుందామనుకున్నాను కానీ నిద్రపట్టలేదు. నిద్రపట్టినా మళ్ళీ మళ్ళీ లేచేవాణ్ణి. లేచినప్పుడల్లా నా గొంతుకమీద ఎవరో కూర్చున్నట్లనిపించేది. ఇదేం బాగాలేదనుకున్నాను. ఆ వచ్చినవాళ్లెవరో చూస్తేగాని నిద్ర పట్టేటట్లు లేదు. వాళ్లను చూడాలి లేకపోతే చచ్చిపోవాలి, అని బయలుదేరాను.

సరే నడవటం ప్రారంభించాను. చంద్రుడు బాగా ప్రకాశిస్తున్నాడు. ఒక గంటసేపు ద్వీపంలో కాలుగాలిన పిల్లిలాగా తిరిగాను. నేను తప్ప మిగతా ప్రకృతి అంతా నిద్రపోతున్నట్టుంది. ద్వీపం అవతలి చివరవరకూ వెళ్లాను. చలిగాలి సాగింది. తెల్లవారటానికి ఇంక అట్టే సేపు లేదనుకున్నాను. ఒక కొయ్య దుంగమీద కూచున్నాను. చంద్రుడు అస్తమించే సూచనలు కనపడ్డాయి. నదిమీద చీకటి నల్లటి కంబళీలాగా పరుచుకుంటోంది. ఇంకా కొంచెం సేపయ్యాక తూర్పుదిక్కు తెల్లబడ సాగింది. తుపాకీ తీసుకొని కిందటిరోజు నెగడు కనిపించినచోటికి వెడదామని బయలుదేరాను. కాని ఎంత వెదికినా ఆచోటు కనిపించలేదు. ఇంతలోకే చెట్లగుండా ఒక మంట కనిపించింది. జాగ్రత్తగా అడుగులో అడుగు వేసుకుంటూ ఆవైపు వెళ్లాను. మంటపక్కన ఒకమనిషి నిలువుగా పడుకుని ఉన్నాడు. తలకు ఒక దుప్పటీ చుట్టుకున్నాడు. ఆ మనిషికి ఆరడుగుల దూరంలో పొదలవెనకాల కూచుని అతనికేసే చూస్తున్నాను. నెమ్మదిగా వెలుతురు ఎక్కువ కాసాగింది. కొంతసేపటికి అతడు లేచి దుప్పటి విసిరేసి బద్ధకంగా ఒళ్లు విరుచుకున్నాడు. వెంటనే వాడెవరో గుర్తుపట్టాను— మిస్ వాట్సన్‌గారి నీగ్రో బానిస జిమ్! వాణ్ని చూడగానే సంతోషం పట్టలేకపోయాను.

"హాలో జిమ్" అన్నాను. నామాటకు ఉలిక్కిపడి ఒక గంతువేసి నాకేసి తెల్లబోతూ చూశాడు. నన్ను గుర్తించగానే మోకరించి, చేతులు జోడించి వెర్రిగా బతిమాల సాగాడు.

"బాబోయ్! నన్నేం చెయ్యకు. నే నెప్పుడూ ఏ దెయ్యానికీ అపకారం చెయ్యలేదు. అసలు చచ్చిపోయినవాళ్లంటే నాకు చెడ్డభక్తి. వాళ్లేం చెయ్యమంటే అది చేస్తాను. నువ్వు నాజోలికి రాకు. నువ్వెక్కడినించి వచ్చావో అక్కడికే పో. ఈ బీద జిమ్ గాణ్ని వాడిదోవన వాణ్ని పోనియ్యి"

వాడి భయం చూస్తే నాకు బలేనవ్వొచ్చింది. నేను దెయ్యాన్ని కాదని, బతికే వున్నాననీ వాణ్ని నమ్మించడానికి సరిగ్గా గంటసేపు పట్టింది. చివరికి నేను దెయ్యాన్ని కాదని తాత్కాలికంగా ఒప్పుకున్నాడు. ఇంక నాకేమీ ఫరవాలేదనుకున్నాను. జిమ్ కూడా తోడు ఉంటే నాకు దిగులుగా ఉండవలసిన అవసరం ఉండదు. నేను మాట్లాడినంతసేపూ జిమ్ ఏదో ఆలోచిస్తూ మౌనంగా ఉన్నాడు. ఇలాగన్నాను.

"బాగా పొద్దెక్కింది. ఇక మనం భోజన ప్రయత్నాలు చెయ్యాలి. ఇంకా కాసిని పుల్లలు వెయ్యి నీ మంటలో."

"వంట చెయ్యటానికి ఏమీ లేదుగదండీ. మీాదగ్గిర తుపాకీ ఉందిగా రెండు మూడు పిట్టల్ని కొట్టి తెద్దాం పదండి." అన్నాడు జిమ్.

"మరి నువ్వేం తింటున్నావూ?" అని నే నడిగాను.

"ఏమీాలేదు సార్" అన్నాడు.

"ఎంత కాలంనించి ఇక్కడుంటున్నావు?"

"మీారు చచ్చిపోయిన రాత్రినించీ నండి"

"అబ్బో! అన్ని రోజులే"!

"అవునండి"

"మరి ఇన్నిరోజులూ ఏం తిన్నావు?"

"రేగుకాయలండి"

"పాపం నీకు దిట్టంగా ఆకలవుతోందనుకుంటాను."

"అవునండి. ఓ కొండంత రొట్టె తీసుకొచ్చినా మింగేసేట్టున్నాను. ఆ. సందేహంలేదు. మీా రెంత కాలంనించి ఉంటున్నారం డిక్కడ?"

"నేను చచ్చిపోయిన రాత్రి నించి."

"అల్లాగాండి. మరి మీారేం తింటున్నారండి? ఓ అన్నట్టు మీాకు తుపాకీ ఉందిగా. ఆ. మంచి తుపాకీయే నండి. బలే. ఇప్పుడు మీారేదయినా తీసుకురండి. నే నీలోగా మంట చేస్తాను."

ఇద్దరం కలిసి నా పడవ ఉన్న చోటికి వెళ్లాం. జిమ్ చెట్లమధ్య పచ్చికమీాద మంటచేశాడు. నేను వాడికి కనిపించకుండా వెళ్ళి పడవలోనించి గోధుమపిండి, మాంసం, కాఫీపొడరు, కాఫీ పాత్ర, పెనం, పంచదార, గ్లాసులు తెచ్చాను. ఇవన్నీచూసి నిర్ఘాంతపోయాడు. నాకో పడవ ఉన్నట్లు వాడికి తెలియదు. అందుచేత వీటిని మంత్రంవేసి తెప్పించాననుకున్నాడు. నాసంపదను చూసి వాడికి నామీాద గౌరవం ఇంకా వృద్ధయింది. నదిఒడ్డున వెళ్లి ఒక పెద్దచేపని కూడా పట్టి తెచ్చాను. జిమ్ దాన్ని కత్తితో శుభ్రం చేశాడు. కమ్మగా వేయించాడు.

వంట అయ్యాక పచ్చికమీాద హాయిగా పడుకుని భోజనం చేశాం. జిమ్ పాపం బాగా ఆకలిలో ఉన్నాడేమో నాకు డబుల్ గా తిన్నాడు. కడుపులు నిండగానే మాకు ఒక గొప్ప సంతృప్తి, సంతోషం వచ్చాయి. బద్ధకంగా పడుకున్నాం. జిమ్ ఇలాగన్నాడు.

"అయితే హక్ గారూ! మీారు చచ్చిపోలేదన్నమాట. మరయితే ఆరోజున మీానాన్న యింట్లో చచ్చిపోయిం దెవ్వరు?"

నేనెల్లా తప్పించుకు వచ్చిందీ, నేనేం చెయ్యదల్చుకుందీ అంతా విశదంగా వాడికి చెప్పాను. నాఉపాయం అద్భుతంగా ఉందన్నాడు. టామ్‌సాయర్ కూడా ఇంత గొప్ప ఉపాయాలు ఎప్పుడూ చెయ్యలేదన్నాడు. నే నడిగాను:

"అయితే జిమ్! నువ్వెల్లా వచ్చావిక్కడికి?"

ఈ ప్రశ్నవిని కొంత కంగారుపడ్డాడు. ఒక నిమిషందాకా మాట్లాడలేదు. చివరికి,

"చెప్పటం మంచిది కాదనుకుంటా నండి" అన్నాడు.

"ఏం?"

"చాలా కారణాలున్నాయండి. మీాతో చెబితే ఇంకెవరికీ చెప్పరు గాదండి?"

"ఊహు! ఒట్టేసుకుంటున్నా."

"మరేం లేదండి. నేను పారిపోయొచ్చాను."

(35-వ పేజీ చూడండి)

# సోమరి సత్యం

ఆ వూళ్ళో కల్లా సత్యం వట్టి సోమరిపోతు. సత్యం చదువు వున్నవాడే అయినా కష్టపడి పనిచేయాల్సి వస్తుందనే భయంచేత ఏవుద్యోగమూ చేయక, తండ్రి యిచ్చిపోయిన నాలుగెకరాలమీద వచ్చే ఆదాయంతో తిని తిరుగుతూ వుండేవాడు.

భార్య శాంతమ్మ ఎంతో పోరు పెట్టగా తెల్లారి పదిగంటలకి నిద్ర లేచేవాడు. కాలకృత్యాలు నెఱవేర్చుకొని, భోజనంచేసి యిల్లు వదలిన సత్యం, బజార్లన్నీ తిరిగి తిరిగి, రాత్రి భోజనంవేళకు యిల్లు చేరేవాడు. శాంతమ్మ ఎన్నోసార్లు చెప్పింది "వూరికే తిరిగేబదులు ఏ వుద్యోగమైనా చూసుకోరాదా" అని. కాని ఆమాటలు సత్యం చెవిన పడేవేకావు.

ఆలోచించగా ఆలోచించగా శాంతమ్మకు ఒక మంచి వుపాయం తట్టింది. ఒకరోజు రాత్రి సత్యం యింటికి రాగానే శాంతమ్మ "ఏమండీ! ఈ చంద్రహారం చూడండి, ఎంత బాగుందో! మన యింటి ప్రక్క కమలమ్మగారిది. మీకు చూపిద్దామని తెచ్చాను. యిట్లాంటి హారం నాకు చేయించరూ?" అంది.

సత్యం కబుర్లు చెప్పటంలో ఫష్టు. "ఆ-ఎందుకు చెప్పు నగల కోసం డబ్బు తగలేయడం. పైగా యీ రోజుల్లో అంతా మోసం. బంగారంలో రాగికూడ కలుపుతున్నారుట. పోనీ ఎట్లా గోట్లా అప్పుచేసి హారం కొందామనుకుంటే, అది చూసినదగ్గరనుంచి ఎవడైనా దాన్ని కాజేయడానికి ప్రయత్నం చేయవచ్చు. అందువల్ల మెదలకుండా వూరుకోటం వుత్తమం" అని సత్యం ఒక చిన్న వుపన్యాసం యిచ్చాడు.

సరే ఆరాత్రి భార్యా భర్తలిద్దరూ భోజనంచేసి పడుకున్నారు. ఒకరాత్రివేళ శాంతమ్మ లేచి దొంగలు! దొంగలు! చంద్రహారం ఎత్తుకు పోయినారు" అని కేకలు పెట్టింది. ఆ కేకలు విని యిరుగు పొరుగువారు కూడా లేచారు. దొంగలజాడ ఏమీ దొరకలేదు. ఎవరిళ్ళకి వాళ్ళు వెళ్ళారు చేసేదేమీ లేక.

"నే చెపితే విన్నావూ? పాడు నగలు మనకొద్దే అని చెప్పలేదా? పైగా అది మనదికూడా కాదాయె" అని శాంతమ్మను చివాట్లు పెట్టాడు సత్యం.

"పోనీ లేండి-ఏం చేస్తాం! కమలమ్మగారితో దొంగ లెత్తుకు పోయినదానికి మేమేమి చేస్తాం అని చెపుతా లెండి" అంది శాంతమ్మ విచారంతో.

"ఛీ- అదేంమాట-అంతకన్నా సామర్దా యింకేమన్నా వుందా- అలాచెప్పి వూళ్ళో యిక తలెత్తుకు తిరగగలమా? ఎలాగయినా సంపాదించి యింకో హారం కొని యిస్తాను" అన్నాడు సత్యం.

మర్నాటినుంచి సత్యం, ప్రయివేటు బడి పెట్టి నాలుగు నెలల్లో నాలుగువందల రూపాయలు సంపాదించి యింకో హారం కొన్నాడు.

"ఇదిగో-హారం. తీసికెళ్ళి కమలమ్మగారి కియ్యి" అన్నాడు సత్యం, హారాన్ని భార్యకిస్తూ.

హారాన్ని తీసుకొని మెడలో వేసుకొని, శాంతమ్మ విరగబడి నవ్వ సాగింది. అది చూసి సత్యం ఆశ్చర్యపోయాడు ఏమీ అర్థంగాక.

"కమలమ్మగారి హారం అప్పుడే యిచ్చేశానండి. దొంగలూ లేరు, పాడూ లేదు. అంతా అబద్ధమే. అలా చేస్తేగాని మీరు సోమరితనం మాని వుద్యోగం చేయరని యీ వుపాయం పన్నా" అంది శాంతమ్మ నవ్వుతూ. భార్య తెలివి తేటలకి ఎంతో సంతోషించాడు సత్యం. ఆరోజునుండీ సత్యం తెల్లవారు ఝామునే నిద్ర లేవసాగాడు. రోడ్లవెంట తిరగటం పూర్తిగా మానేసి, విద్యార్థులకు శ్రద్ధగా చదువు చెపుతూ, డబ్బు సంపాదించ సాగాడు. అప్పటినుండి భార్యా భర్తలు సుఖంగా ఎవరి కర్తవ్యాన్ని వారు నిర్వహించుకుంటూ వుండసాగారు. శాంతమ్మ వుపాయంవల్ల సత్యం యొక్క సోమరితనం అంతా మాయమయింది. ★

"సూర్యశ్రీ"

# ★ డార్విన్ ★

సృష్టి ఎలా జరిగిందో ఆ క్రమాన్ని గురించి పెద్దవాళ్లు భాగవతం చదవడం నువ్వు వినే ఉంటావు. నువ్వుకూడా అది చదివావో లేదో తెలియదు. నామట్టుకు నేను అది పూర్తిగా చదవలేక పోయిన మాట నిజం. కాని సృష్టిక్రమం గురించి శాస్త్రవేత్తలూ విద్యావంతులూ భాగవతంలో చెప్పిన క్రమాన్ని ఈ కాలంలో ఒప్పుకోరు. బైబిల్‌లో చెప్పిన క్రమాన్నీ ఒప్పుకోరు. నరజాతికంతకీ మూలపురుషుడు వానరుడంటారు.



ఇలా అంటే నమ్మని వాళ్లు ఇప్పటికీ కొంతమంది ఉన్నారు. కోపం తెచ్చుకునే వాళ్లు ఉన్నారు. మొట్టమొదట ఈసత్యాన్ని నిరూపించిన వ్యక్తిపేరు చార్లెస్ డార్విన్. అతనలా అన్నందుకు ఆ రోజుల్లో అతన్ని అందరూ ఏకమై దుయ్యబట్టారు కొద్దిమంది విజ్ఞాన శాస్త్రవేత్తలు తప్పవిడిచి. మనిషికి మూలపురుషుడు కోతి అన్నందుకే కాదు, అసలు సృష్టి క్రమాన్ని గురించి వివిధ మతాలవారు చెప్పుకునే విధానా లన్నిటినీ తారుమారు కూడా చేసినందుకుఅతన్ని అందరూ దుయ్యబట్టారు.

"తాతను బట్టి అనుకున్నారా, అమ్మమ్మను చూసి అనుకున్నారా మీ పూర్వీకులు కోతులని?" అంటూ ఒక బిషప్ అవహేళన చేశాడు. "మీతాత కంటె కోతే నయం" అని డార్విన్ తరఫున హక్స్లీ అనే శాస్త్రవేత్త బదులిచ్చాడు.

ఎంతమంది ఎంతగా తిట్టిపోసినా చివరికి డార్విన్ వాదమే నెగ్గింది. నెగ్గి విజ్ఞాన ప్రపంచంలో అపూర్వమైన పరివర్తన తెచ్చింది. ఈమధ్య ఏటంబాబు కనిపెట్టడం ఎంత గొప్పసంగతో, డార్విన్ పరిణామ వాదాన్ని నిరూపించడం అంత గొప్పసంగతి.

డార్విన్ తరవాత పరిణామ వాదం చాలావృద్ధి పొందింది. అతని వాదంలో రెండు ముఖ్యమైన విషయాలు చెప్పాడు. మనిషి ఆదినించీ మనిషిగా లేడు ఏనుగులు కూడా ఆదిలో ఇప్పటి ఏనుగుల మాదిరిగా లేవు. క్రమ క్రమంగా వాటి స్వరూపం మారి ఈ నాటికిలా తేలాయి. ఇలాటివి చిన్న చిన్న మార్పులు జరగడానికి అనేకవేల సంవత్సరాలు పట్టుతుండిట. రెండోది ఈమార్పులకి మూలమైన సిద్ధాతం. 'బలవంతులదే రాజ్యం' అన్నట్టుంటుంది ఈ సిద్ధాంతం. జంతువులూ పక్షులూ ఆత్మరక్షణకోసం ఎలా జాగ్రత్త పడతాయో, వాటివాటి కోరలూ, రంగులూ, అంగాలూ ఏ అక్కరకోసం ఎలా ఏర్పాటయినాయో నువ్వు స్కూల్లో చదివే ఉంటావు. ఊసరవెల్లి రంగులు మార్చుకుంటూ, పచ్చ మొక్కల్లో ఉన్నప్పుడు పచ్చగానూ తెల్ల గోడపైన కూచున్నప్పుడు తెల్లగానూ ఉంటుందనీ, చడీ చప్పుడు కాకుండా ఎలకల మీద పడ్డంకోసం పిల్లులికి పాదాల

క్రింద మెత్తని కండరాల దిళ్లుంటాయనీ చదివిన విషయాలు నువ్వు మర్చిపోలేదనుకుంటాను. ఇలాగ సర్వ జలచరాలకీ, భూచరాలకీ వేర్పాట్లుంటూ యిట. కాలక్రమేణా పరిస్థితులూ అవసరాలూ మారిన కొద్దీ ఆయా ప్రాణుల అంగాలలోకూడా మార్పువస్తుందిట. అనేక లక్షల యేళ్లకి పూర్వం యేనుగులిప్పటి వాటికంటె చాలా పెద్దవిగా ఉండేవిట. ఒంటినిండా గొర్రెమాదిరిగా బొచ్చుండేదిట. డార్విన్ వాదం ప్రకారం పరిణామంలో ఏంజరుగుతుందంటే అవసరాలు మారుతున్నప్పుడు అవసరం తీరిపోయిన అంగాలు క్రమంగా అంతరించిపోతాయి. అక్కర ఎక్కువయ్యే అంగాలు వృద్ధిచెందుతాయట. దీని ప్రకారమే ఒకానొకప్పుడు ఈ భూమిమీద మనుషులుండేవారే కాదనీ,రకరకాల కోతులుమాత్రమే ఉండేవనీ, క్రమంగా వాటికి బొచ్చూడిపోయి చేతులూ కాళ్లూ సైజుమారిమనుషులుగామారాయనీ డార్విన్ వాదం.

తనవాదాన్ని నిరూపించకోడానికి డార్విన్ తన జీవితాన్నంతా ధారపోసి పరిశోధన చేశాడు. ఇతనితాతగారు ఇంగ్లాండ్ లో ప్రఖ్యాతిచెందిన విజ్ఞానశాస్త్ర పరిశోధకుడు. తండ్రి డాక్టర్. ఇతను 1809 లో ష్రూస్‌బరీలో పుట్టాడు. చిన్నతనంనించీ ఇతనికి పురుగుల్ని పక్షుల్ని పరిశీలించడం అలవాటు. స్కూల్లో చదువుదారి చదువుదీ, ఇతనిదారి ఇతనిదీ అయింది. నత్తగుల్లలు, ముద్రలూ, పాత నాణేలూ, వింతవింతరాళ్లు పోగుచేసేవాట్ట. చాలా చిన్నతనంలోనే చుట్టూఉండే ప్రకృతిని పరిశీలించడం అతనికి సరదాట. పురుగుల్ని పట్టుకుని వాటికాళ్లు, కళ్లు, కోరలు అవీ ఎలాగున్నాయో అన్నీ చూసేవాట్ట. చూసినదెన్నడు మరిచిపోయేవాడుకాదు. కళాశాలలో ఉండగా, ఇతని ప్రతిభ కనిపెట్టి అధ్యాపకులు సహాయం చేశారు. తరవాత ఒక ఓడలో దక్షిణ అమెరికా, ఆస్ట్రేలియా, న్యూజీలాండ్, మల్దీవ్ ద్వీపాలు మొదలైన ప్రాంతాలు పర్యటనచేసి భూగర్భంలోఉండి క్రమంగా బైటపడిన అస్థిపంజరాలనూ ఎముకలనూ పరీక్షచేశాడు. పరిశోధన చేసిన ఫలితాల్ని గ్రంథరూపంలో ప్రచురించి పరిణామవాదాన్ని నిర్వచించాడు.

క్రమక్రమంగా పరిణామవాదం శాస్త్రవేత్తలచేత అంగీకరించబడింది. ఈ వాదంతో పుక్కిటికథలూ, పురాణవాదాలూ మూలబడినాయి. సృష్టినిగురించి ఇతను చెప్పినవాదం తరవాత, పరిశోధనల వల్ల మరింత రూఢయింది. విజ్ఞాన ప్రపంచంలో డార్విన్‌ని మూల పురుషులలో ఒకళ్ళిగా లెక్కకడతారు. డార్విన్ ఇంత ప్రతిభావంతుడైనాడంటే కారణం అతనే చెప్పుకున్నాడు. "అతిస్వల్పవిషయాల్నికూడా శ్రద్ధగా పరిశీలించడం, దాన్ని ఆకళింపు చేసుకోడం నాకు చిన్నప్పటినించీ అలవాటయింది" అన్నాడు. అలాగే అందరూ విషయాలన్నిటినీ జాగ్రత్తగా పరిశీలించడం నేర్చుకుంటే విజ్ఞానమూ, అభివృద్ధి చెంది, మనుష్యులమధ్య అపోహాలూ, కలహాలూతగ్గి కొంతైనా కష్టాలు తగ్గుతాయి. ఈమాటు ఉత్తరం పెద్దదయిందనుకుంటా. విసుగు తెచ్చుకోకుసుమా.

నీ కొత్త అన్నయ్య

—ఎస్సార్

## హకల్ బెరీ ఫిన్

(31-వ పేజీ తరువాయి)

"అరె! పారిపోయావా?"

"హాక్ గారూ! మీకు యెన్ని దణ్ణాలు పెట్టమంటే అన్ని దణ్ణాలు పెడతాను. ఎవరితోనూ చెప్పకండి. ఒట్టేసుకున్నారు కూడాను. చెప్పరుగదూ?"

"చెప్పనన్న తరవాత చెప్పను. దేవుడిమీద ఒట్టు. కాని ఈసంగతి తెలిస్తే అంతా నన్ను తిడతారు. 'నీగ్రో స్వతంత్రవాదిని' అంటారు. అయినా నేను లెక్క చెయ్యను. ఎవ్వరితోను చెప్పనులే. అసలు నేను వెనక్కి వెళ్లటం లేదుగా! సరేగాని నువ్వెలా తప్పించుకొచ్చావు?"

"ఏం లేదండి. ఏం జరిగిందంటే—ముసలి అమ్మగారు ఉంది చూడండి, అంటే మిస్ వాట్సన్ గారు—ఆవిడ నన్నస్తమానమూ వేపుకుతినేది. ఆవిడచెప్పిన పని చేస్తే ఎందుకు చేశావంటుంది. చెప్పనిపని చెయ్యకపోతే ఎందుకు చెయ్య లేదంటుంది. ఈమధ్య ఒక బానిసవర్తకుడు ఆవిడతో ఏదో మాట్లాట్టం సాగించాడు. ఏదో ఉందిరా అనుకున్నాను. ఒకరోజున నెమ్మదిగా పాకి వెళ్లి చాటుగా ఉండి విన్నాను. ఆ వర్తకుడు ఆర్లియన్స్ రాష్ట్రం వాడట. వాడికి నన్నమ్మేద్దామని అనుకుంటోంది. అసలు తనకి నన్నమ్మేదామని లేదట. వర్తకుడు ఎనిమిదివందల డాలర్లు ఇస్తానన్నాడు. ఆ మొత్తం వినగానే ఆవిడ ఉబలాటం పట్టలేక పోయింది. అమ్మేస్తానన్నది. ఇది వినగానే నేను వెనక్కి చూడకుండా పరుగు పుచ్చుకున్నాను. పడవల రేవుకు వెళ్లాను. ఒక పడవని దొంగిలించి ఎక్కడకన్నా పారిపోవాలనుకున్నాను. కాని పడవల రేవునిండా జనం. అంత రాత్రివేళకూడా అంతమంది ఎందుకు గాబరాగా తిరుగుతున్నారో తెలియలేదు. ఎంతసేపు కాచుకున్నా వాళ్లు కదల్లేదు. ఒక్కపడవా నాకు దొరకలేదు. తెల్లారి ఆరుగంటలయ్యేటప్పటికి ప్రతివాళ్లు ఓపడవని తీసుకోటం, ఇల్లి నాయిస్ రాష్ట్రంవేపు మీనాన్న యిల్లుందే, అక్కడికి పోవటం సారించారు. ఆఖరి పడవలో బోలెడుమంది ఆడవాళ్లెక్కారు, వాళ్లు మాట్లాడుకుంటుంటే విన్నాను: ఆరాత్రి మీనాన్న తనయింటికి వెళ్లి చూస్తే మీరు కనిపించలేదట. మిమ్మల్ని ఎవరో చంపినట్టు, మీ శవాన్ని ఎక్కడో పారేసినట్టు గుర్తులు కనిపించాయిట. పాపం మీరు చచ్చిపోయిన మాట విని నేను కొంతసేపు ఏడ్చాననుకోండి. ఆపగలల్లా పడవలరేవు చుట్టుపక్కలే దాక్కున్నాను. మిస్‌వాట్సన్ చీకటి పడేదాకా నేను పారిపోయిన సంగతి కనుక్కోలేదు. ఎందుకంటే తెల్లారకముందే నేను మామూలుగా గొడ్లని తోలుకొనిపోతాను అంచేత చీకటిపడేవరకూ అక్కడే దాక్కుని తరవాత ప్రయాణం సాగించాలనుకున్నాను.

నది ఒడ్డునే రోడ్డు వెంబడి రెండుమైళ్లు పోయేను. అక్కడ ఇళ్లు గిళ్లు లేవు. కాని నాకో అనుమానం తట్టింది. కాలినడకనే ప్రయాణంచేస్తే కుక్కలు నాఅడుగులు పసిగట్టి నేనున్న చోటు కనుక్కుంటాయి. పోనీ ఒక పడవ దొంగిలించి పోదామంటే పడవ వాళ్లు కనుక్కుని వెంటబడతారు. అందుచేత ఏం చేసేనంటే చీకటిపడ్డాక పడవల రేవునుంచి ఒకపడవ ఇల్లి నాయిస్ రాష్ట్రంవేపు ఒడ్డుకి వెడుతూఉంటే దాంట్లో దొంగతనంగా ఎక్కేను. ఆపడవ అంతా చీకటిగా ఉంది. అందుకని నన్నెవ్వరు కనిపెట్టలేదు. కాని జాక్సన్‌ద్వీపం దగ్గిరలో కొచ్చేసరికి పడవ వాడెవడో నేనున్నవేపుకు లాంతరుతో రావటం చూసేను. వాడు నన్ను చూడకముందే గబుక్కున నీళ్లలోకిదూకి జాక్సన్‌ద్వీపానికి ఈదుకువచ్చేను. నాటోపీలో కొన్ని అగ్గిపుల్లలు, పొగాకు, తడవకుండా ఉన్నాయి. అందుచేత ఇక్కడ ఇంతవరకు బాగానే గడిచింది."

"అయితే పాపం నీకింతవరకు సరిగ్గా తిండి లేదన్నమాట. పోనీ చేపలు పట్టలేకపోయావా?"

"చేప లెక్కడనుంచి వస్తాయి? నీళ్లలో నుంచుని చేతులతో పట్టుతుంటే దొరుకుతాయా? పైగా రాత్రిపూట చేపలు కనిపించద్దూ? ఎందుకంటే పగటిపూట నేను దాక్కునే ఉంటున్నాగాని బయటకి రావటంలేదు."

"అయితే నీకు వాళ్లు పేల్చిన ఫిరంగి వినపడిందా?"

"ఆ. మీకోసనే వాళ్లు వెతికారు. ఈ ద్వీపం

దగ్గిరసా కూడా వచ్చేరు. నేను పొదలలో దాక్కుని చూసేను."

ఇంతలో రక రకాల పక్షులు ఎక్కడెక్కడి నుంచో వచ్చి గుంపులుగా వాల సాగేయి. దాన్ని బట్టి వాన రాబోతోందని జిమ్ జోశ్యం చెప్పేడు. నేను వాటిలో కొన్నిటిని తుపాకీతో పేలుస్తా నన్నాను. కాని జిమ్ వద్దన్నాడు. వాన రాబోయేముందు పక్షుల్ని చంపుతే చంపినవాడు కూడా చచ్చిపోతాడట. వాళ్ల నాయనకి ఒకసారి అల్లాగే జరిగిందట. ఇంకా ఇల్లాంటివే ఎన్నో చెప్పాడు జిమ్.

వంట చేసేటప్పుడు ఎన్ని పదార్థాలు వండబోతున్నామో లెక్కపెట్టకూడదట. సూర్యుడు అస్తమించేక దుప్పటి దులపకూడదట. ఒకమనిషి తేనెటీగలని పెంచుతున్నాడనుకోండి ఆమనిషి చచ్చిపోతే మర్నాడు తెల్లవారేలోపలగా తేనెటీగలకి యజమాని చచ్చిపోయేడని చెప్పాలి. లేకపోతే తేనెటీగలు జబ్బుచేసి చచ్చిపోతాయిట. తేనెటీగలు తెలివితక్కువ వాళ్లను కుట్టవని చెప్పేడు జిమ్. కాని ఈమాట నమ్మలేదు నేను. ఎందుకంటే నే నెన్నిసార్లు తేనెతొట్టె దగ్గరకు వెళ్ళినా అవి నన్ను కుట్టలేదు.

జిమ్‌కు ఇన్ని విషయాలు ఎల్లా తెలుసా అని ఆశ్చర్యపోయేను. తనకి తెలియని విషయం అంటూ లేదని వాడే చెప్పేడు. శకునాలు చెప్పటంలో వాణ్ణి మించినవాడు లేడు. ముఖ్యంగా వాడు చెప్పేవన్నీ చెడ్డ శకునాలే. మంచి శకునాలు లేవాఅని అడిగేను. వాడు అన్నాడు:

"ఉన్నయిగాని చాలకొద్దిగానండి అవయినా పనికొచ్చేవికాదండి. అసలుమంచి శకునాలు తెలుసుకోవటమెందుకూ? చెడ్డశకునాలవుతే రాకుండాచేసుకునేందుకు తెలుసుకోవచ్చు. మంచి శకునాలయితే? ఇప్పుడు ఒక మనిషికి చేతులు, వీపు, కాళ్లు, దట్టంగా వెంట్రుకలు పెరిగిఉంటాయనుకోండి వాడుబోలెడు డబ్బు సంపాయిస్తాడు. అటువంటిదయితే ముందు తెలుసుకోవచ్చు. లేకపోతే ఆ మనిషి ఇక ఎప్పటికీ డబ్బురాదనుకుని చచ్చిపోడానికి చూడొచ్చు."

"నీకు ఒంటిమీద బాగా బొచ్చుఉందాజిమ్?"

"కనిపించడంలేదాండి? ఇదేం"

"మరైతే నీకు డబ్బేది?"

"ఒకప్పుడు నాకు డబ్బుండేది. 14 డాలర్లు సంపాయించేను. అయితే అదంతా జూదమాడి పది డాలర్లు నష్టపడ్డాను."

"మరి మిగతా నాలుగుడాలర్లు ఏంచేసేవు?"

"మిష్టర్ బ్రాడిష్‌గారిదగ్గర ఒక నీగ్రో నౌకరున్నాడు చూడండి వాడు ఒకసారి ఒక బ్యాంకి పెట్టేడు. బ్యాంకిలో ఒకడాలరుదాస్తే ఏడాదిలో అది నాలుగుడాలర్లవుతుందని చెప్పేడు. చాలామంది నీగ్రోలు ఒక్కొక్కడాలరే వేసేరు. నేను ఆశకొద్దీ నాలుగు డాలర్లు వేసేను. కొన్నాళ్లయాక ఆ నీగ్రో తన బ్యాంకి దివాళాతీసిందని చెప్పేడు. దాంతో ఆ డబ్బుకూడాపోయింది."

"పోనీలేజిమ్ మళ్లీ ఎప్పుడో ఒకప్పుడు ధనవంతుడి వౌతావేమో"

ఎప్పటిదాకానో ఎందుకండి ఇప్పుడు నేతలుచుకుంటే చాలా డబ్బు వస్తుంది. ఇంటిదగ్గర నుంచి పారిపోయి వచ్చేనుకదా మళ్లీ ఎవరికన్నా నన్ను అమ్మేసుకుంటే ఎనిమిది వందల డాలర్లు వస్తాయి అది చాలదూ నాకు."

(ఇంకా వుంది)



# పెంచిన ప్రేమ

(11-వ పేజీ తరువాయి)

దక్కలా లేదు' అంటూ హనుమాయమ్మ త్రేనుస్తూ పీటల్ని గోడలికి చేరేస్తోంది.

'ఏం అత్తయ్యా?' నేనేం చేశాను? ప్రశ్నించాడు, భగవాన్లు దీనవదనంతో.

'ఒక సారి చెప్తే జ్ఞానం లేదురా?'

దీపానికి ఒక మూరెడు దూరంగా ఉండు, లేకపోతే వంగుతే ఆ తలకాయ కాలితే ఏం జేయనూ?' అంది. హనుమాయమ్మ.

ఇప్పటి కర్థమయింది.

మూరడు దూరం పోతే కాన్పించే దేముంది ఆ గుడ్డి దీపం దగ్గర.

కౌసల్య...కౌశ.. కౌశలలాకు యాండ్లో మూసె బలుకుతున్నాడు.

'నీకు చదువు వచ్చే యోగం లేదు—

అరిభ్రష్టాకారీ!— భ్రష్టాకార్ని బాగు చేయలేం. అదృష్టవంతుడ్ని చెరచాలేం— అందుకుంది హనుమాయమ్మ.

ఈ సాధింపుల కంతరార్థం తెలిస్తేకదూ వాడసలు విచారించటానిక్కి.

ఆవలించటం ప్రారంభించాడు. వెళ్లి పడుకోమని హుకుం జారీ చేసింది.

తిట్లుతో జోకొట్టినట్లు పడుకున్నాడు.

వాడే తండ్రే వుంటే తల్లినీ, వాళ్లనూ వదులుకునీ వస్తాడా! అయ్యో! నా నోరు మండా! పాపం కుర్రాడు ఎంతగా హడలి పోయాడో అని పశ్చాత్తాపం దహిస్తుంటే కుర్రాడి ప్రక్క వాలి పరికిస్తోంది ముఖం వాత్సల్యంగా.

హనుమాయమ్మ భర్త రివెన్యూ డిపార్టుమెంటులో కొస్త పలుకుబడి గల ఉద్యోగంలోనే వున్నాడు. బావమరది కొడుకని భగవాన్లుని ఆదరంగానే సాకుతూ వచ్చాడు. కొస్త ప్రథమ కోపం కల మేనత్తే ఎప్పుడైనా చిరమర లాడుతుంటుంది.

హనుమాయమ్మ భర్త ఆదికేశవులుకు డబ్బు అంటె తగని సరదా. ఉన్న ఉద్యోగంచాలక ఊళ్లో ఛోటా, ఛోటా ఉద్యోగాలు అంటే జీతబత్తేలు లేని గౌరవ ఉద్యోగాలు చేస్తూంటం కూడా కద్దు.

*　　*　　*

భగవాను భగవత్కృపవల్ల చిన్న చిన్న పరీక్షల్ని నెట్టుకొచ్చి ప్రాజ్ఞుడయ్యాడని పించుకోవటం ఇంకొక్క పరీక్ష—అదే ఆఖరు సంవత్సరం—స్కూల్ ఫైనల్ క్లాసు—మిగలటం—తటస్థించింది.

అది కాస్తాకూడా అయిందనిపిస్తే భగవాన్లుకూడా, నలుగురుతోబాటు, సంసార సాగరాన్ని, ఈదే యోగ్యతకల పత్రాన్ని అందినట్టు ఆనందించవచ్చు.

సెలవులు ఆఖరయ్యాయి. స్కూళ్లు తెరచారు. జీతం కట్టాలి.

'మామయ్యని ఎరెస్టు చేసారటత్తయ్యా' అన్నాడు ఏడుస్తూ.

'ఎందుకూ?' అంది ఏడుస్తూ హనుమాయమ్మ.

"ఊళ్ళో చేసిన ఊద్యోగంలో, డబ్బుకు సంబంధించిన ఎక్కౌంట్సు సరిగ్గా తేల్చలేదుట;" అన్నాడు గద్గద స్వరంతో,

'ఎవరు చెప్పారు నాయనా నీకు, ఇది నమ్మవచ్చా అంది,' దిగాలున కూలబడి.

'ఆఫీసులో ఒకటే గోలవుతోంటే!

'చిట్టయ్యగారుకూడా చెప్పారు.' సాక్ష్యంకూడా బలపర్చేసరికి నవనాళ్లూ క్రుంగిపోయాయి, హనుమాయమ్మకు. హనుమాయమ్మ, ఆవేశంలో, వీరాంజనేయ స్వరూపం ధరించింది.

'చావనీ; మొదటినుంచీ, చెబుతూనే వున్నా; వద్దండీ వెధవడబ్బు, వెధవ ఉద్యోగం అంటే విన్నారా; చేతిలో డబ్బుంటే, స్నేహితులే కొదవా; మొన్న సీతారామయ్యగారి కిచ్చిన నాలుగువందలూ మాట అడిగేసరికి నీకెందుకు లేస్తూ అన్నారు. ఆయనో డైరక్టరు—ఈయనో సెక్రటరీగారూను. కోఆపరేటివ్ ఉద్యోగం కొంపకీకింది చివరికి. సొమ్ము దగ్గర మెత్తపడితే ఏమవుతుంది. ప్రజలు సొమ్ము, పంచుకుందుకే పెట్టారేంటి ఈ మహాత్ముల్ని—నా కిప్పుడు తెలిసింది;' నాయనా చిట్టయ్యగార్ని ఒకసారి రమ్మను.

*　　*　　*

ఆదికేశవులుగారి జీవితం అంధకారమయింది. కృష్ణజన్మస్థానం అలంకరించారు. ఇనుప కటకటాల కివతల భగవాన్లు ఏడుస్తూ భోజనం అక్కడ పెట్టేసి, చెట్టునీడలో నుంచున్నాడు.

'నాకేం ఫర్వాలేదని చెప్పు—నేనేమైనా తింటె నాకే హాని; బదులు ఇచ్చాన; కాబట్టి భగవంతుడే కాస్తాడు. దీనికోసం ఎందుకర్రా ఏడ్వటం' అని గదిలోనుండి కుర్రాడికి ధైర్య వచనాలు చెప్తున్నారు ఆదికేశవులు. 'ఈ రోజుల్లో న్యాయం పని చేయటానిక్కి; పరాకు చిత్తగించే, అధికారైవరూ లేరు. వెళ్ళిపోయ్ కుర్రాడా' అనా డొక ప్రక్కనున్న ఖైదీ.

చొక్కా అంచులతో, కొళ్ళకన్నీటిని తుడుచుకుంటూ, ఇంటిదారి పట్టాడు భగవాన్లు.

మరునాడు కూడా భోజనం పట్టుకెళ్ళాడు.

'ఇంక ఈరోజుతో సరి. రేపటినుండి,

మీరు మాత్రం ఏమీ పెట్టకూడదన్నాడు' కాపలా ఉండే కనిష్టేబు.

'ఏం?' అన్నాడు భగవాన్లు రిత్త పోయి.

ఇన్నాళ్లూ ఈయనికి రిమాండు.

ఈ రోజు నుండి శిక్ష, శిక్ష వేసీ, రేపు రాజమండ్రీ సెంట్రల్ జైలుకు కట్టేస్తారు. కుర్రాడిక్కి విపులంగా వివరించాడు.

'మరి మా అన్నం మీకక్కర లేదూ?' మామయ్యా అని ఒక్కసారి కూలబడ్డాడు. ఆశా సౌధం కూలిపోయింది. అనుకున్న ఆలోచన్లు గాలి మేడలయ్యాయి — భగవాన్లు లాల్చీ కన్నీళ్లతో తడిసి ముద్దయింది.

'కండువాతో, కారే కన్నీటిని వత్తుకుంటూ,' భగవంతునిపై భారం వేసి, నోట మాటరాని అయోమయ పరిస్థితిలో అల్లల్లాడుతున్నాడు ఆదికేశవులు.

ఆప్యాయంగా రెండు చేతులు చాచాడు కుర్రాడికేసి పెంచిన ప్రేమ చేత.

గానీ ఆ నాడు దుఃఖాన్కి ఐ. జి. ఆర్. ఇంజను అడ్డు, ఈ నాడు ఇనుప కటకటాలు అడ్డయ్యాయి భగవాన్లుకి.

'జాగ్రత్తగా ఉండండి. నే వస్తా' అని ధైర్య మిచ్చింది పెంచిన ప్రాణం స్వాధీనంలో లేని మామయ్యాని విడిచి రాలేక, వచ్చేదెప్పుడో, అని దీనంగా చెట్టు క్రింద చతికిల పడ్డాడు భగవాన్లు. ★

# సుందరమ్మ మనసు

(10-వ పేజీ తరువాయి)

వచ్చాడు, యిక తప్పక అడుగుతాడని ఎంతో కంగారు పడేది.

సాయంత్రానికల్లా ఆనందరావు వచ్చాడు. గాబరాగా వున్నా, సుందరమ్మను ఆనందరావేమీ గమనించలేదు. ఏమీ అడుగలేదుకూడాను. సుందరమ్మ కూడా ఆనందరావులో ఏవీ మార్పులు లేక పోడానికి చాలా సంతోషించింది. అయినా భయం మాత్రం లోపల భయపెడ్తూనే వుంది.

* * *

తమలపాకుల చిలకలందిస్తూ సుందరమ్మ తన సందేహం తీర్చుకో మొదలు పెట్టింది

"ఏవండీ! మిమ్మల్ని ఒక మాట అడగనా" అని.

"ఏమిటి?"

"చెప్తారా?"

"చెప్పనని యెప్పుడైనా అన్నానా?" అన్నాడు ఆనందరావు, హాస్య ధోరణిలో.

"ఉదయం నేను నీళ్ళు పట్టేటప్పుడు నవ్వుతూ చెయ్యి వూపారెందుకు?" అని అవాలిసిన కొత్తమాటా అడిగేసింది, తడియారిన కంఠంతో, జవాబుకోసం వళ్ళంతా చెవులు చేసికొని.

"బండి వెళ్ళేటప్పుడు అలాగే చేయి వూపాలి" అన్నాడు ముక్తసరిగా.

సుందరమ్మ అనుకొన్నది ఒకటయితే, ఆనందరావు జవాబు యిచ్చినది యింకొకటి అయింది. సుందరమ్మకు యిదేమీ అర్థం కాలేదు. ఒకవేళ తన భర్త యీ మాటల్లో నిజం చెప్పకుండా మభ్యపెట్టడం లేదు. గదా? ఏమో! ఎవరికి తెలుసు, మనిషిలోని మర్మం అంచేత మళ్ళా ప్రశ్నించింది "ఎందుకు అలా వూపాలండీ" అని. తన సందేహాన్ని పూర్తిగా తీర్చుకోడానికి.

"బండి వెళ్ళేప్పుడు గార్డు, డ్రైవరు, మాష్టరు...ముగ్గురూ బండి సరిగ్గా నేబయులు దేరుచున్నది అన్నట్లుగా పచ్చజండాలు వూపాలి. దీనికోసం అని లోని జండాలు తెచ్చి ఎవరు వూపుతారని సాధారణంగా చేతులనే వూపుతాం" అనేసరికి సుందరమ్మ తెల్లబోయి యింకేమీ మాట్లాడలేక 'అలాగా' అంటూ ఆనందరావు ప్రక్కన వాలిపోయింది. "ఏం? ఎందుకు, నీకీ 'అజలు'? నీవు కూడా మాష్టరు పని చేయాలని వుందా?" అంటూ ఆనందరావుసుందరమ్మను దగ్గరకు తీసికొన్నాడు, పాపం! సుందరమ్మ అసలు ఆ ప్రశ్న యెందుకు వేసిందో, నిజం అర్థం గాక.

ఇంకా నయ్యం! భాస్కర్రావుతో పాటు సుందరమ్మ కూడా చేయి వూపలేదు. ★

# నాయనమ్మ

(22-వ పేజీ తరువాయి)

పిల్చికోప్పడింది.

మర్నాడు సాయంత్రం "లక్ష్మి దెబ్బలు ఎలాగున్నాయో చూచి రండ్రా" అన్నా. బాబోయ్ నాయనమ్మకి తెలిస్తే ప్రాయశ్చిత్తం చేస్తుంది, నే వెళ్లనంటే, నే, వెళ్ళనన్నారిద్దరూ, పిచ్చిపిల్లలు, అనుకున్నా. "పద్మా..." అని ఏమో చెప్పబోతుంటే వినిపించుకోకుండా పోయారిద్దరూ ఆటలోకి. నేను మా డాబా మీదనుంచుని చూస్తున్నా ఆటని. ఇంతలో ఏనాది సుబ్బడువచ్చి తనూ ఆడతానన్నాడు. "వద్దుబాబు నిన్ను ముట్టుకుంటే మా నాయనమ్మ ప్రాయశ్చిత్తం చేస్తానంది" అందిపద్మ. ప్రాయశ్చిత్తమంటే ఏమిటని అడిగారు పిల్లలు. పద్మ, క్రిష్ణా, ప్రాయశ్చిత్తాన్నిగూర్చి చాల భయంకరంగా వర్ణించారు. పిల్లలంతా భయపడి, వాణ్ణి ఆటలోకిరావద్దు పొమ్మన్నారు. పాపం వాడు బిక్కమొగంవేసుకుని నుంచున్నాడు. పద్మ ఆటలో పరుగెడుతూ సుబ్బణ్ణి ముట్టుకుంది. అది క్రిష్ణ చూచాడు. పద్మ సుబ్బణ్ణి ముట్టుకుందని గట్టిగా అరిచాడు. పద్మ కళ్ళల్లో నీళ్లు తిరిగాయి. తను సుబ్బణ్ణి ముట్టుకోలేదని వాదించింది, పైగా "క్రిష్ణ, ఆటలో లేడు, అబద్ధాలు చెబుతాడ"ంది, క్రిష్ణ "నేనసలు ఆడన"ని అరుగుమీద కూర్చున్నాడు. ఆట అంతా అయిపోయింది. ఎవరిళ్ళకు వాళ్లు వెళ్ళిపోయారు. పద్మ క్రిష్ణ దగ్గరకొచ్చి "ఒరే, క్రిష్ణా నిన్ను బతిమిలాడుకుంటా కాని, ఈ విషయం, నాయనమ్మతో చెప్పకురా, రేపు నీకు బేడయిస్తా" నంది. వాడు ఒప్పుకున్నాడు "బేడరేపుయివ్వకపోతే చెప్పేస్తా" అని ఒకమారు హెచ్చరించాడు. తరువాతిద్దరూ యింట్లోకి పోయారు ఏం తెలీనట్లు. ఇదంతా వింటున్న నాకు ఎంతో జాలేసింది. ప్రాయశ్చిత్తానికి భయపడి అబద్ధమాడానికి తయారయ్యేరు వాళ్లు. చిన్నటికి యివ్వాల్టికి ఎంతతేడా వాళ్ళల్లో. పెద్దవాళ్లు ఏదో పిల్లల్ని మంచిమార్గంలో పెడుతున్నామని భయపెడుతున్నారు. ఆ భయానికి లొంగి, పసివాళ్లు, అబద్ధాలు చెప్పడం, దొంగతనముచేయడం నేర్చుకుంటున్నారు. అందులోను మా నాయనమ్మలాటివాళ్లు మరీని. పిల్లలకి భయం నేర్పుతున్నామని ఏవో పిచ్చిసంగతులు చెప్పి భయపెడతారు అందుకే వాళ్లు చెడ్డ పనులు నేర్చుకుంటున్నారు. కాని నే నేంచెయ్యను ? నేను అస్వతంత్రురాలిని. అందుకే స్త్రీకిస్వాతంత్ర్యం కావాలంటారు. ఇంట్లో మా నాయనమ్మదే పెత్తనం, నాన్నకూడ ఆవిడ మాటకి సమాధానంచెప్పరు. మా నాయనమ్మకి సత్యంగా చెపితే వినదు. వేళాకోళంగా అంటే కోపం. పోనీ సీరియస్ గా చెప్తే నామాటకి ఎదురు చెబుతున్నారని, నిప్పులేకుండా భగ్గున చలిమంట వేస్తుంది యింట్లో. ఎలాగ యిల్లాంటి నాయనమ్మలతో. ★

# వినోదా పిక్చర్సు వారి
# 'శాంతి'

నిర్మాత : శ్రీ డి. యల్. నారాయణ.

దర్శకుడు : శ్రీ వేదాంతం రాఘవయ్య.

కథ, మాటలు : శ్రీ కొవ్వలి.

పాటలు : శ్రీ సముద్రాల (జూనియర్) రామానుజాచారి.

నటీనటులు : డా॥ గోవిందరాజుల సుబ్బారావు, రామచంద్ర కాశ్యప, పేకేటి శివరామ్, ఆరణి, సావిత్రి, చంద్రకుమారి, హేమలత మొదలైనవారు.

వినోదా పిక్చర్స్‌వారి 'శాంతి' ఫిబ్రవరి 15వ తేదీని ఆంధ్ర దేశమంతటా విడుదలయింది. నిర్మాత శ్రీ డి. యల్. నారాయణగారు మూడుమాసాలలో నిర్మించిన ఈ సాంఘిక-చిత్రం మూడుగంటలసేపు నడుస్తుంది. రైల్వే సాహిత్యం ద్వారా ఆంధ్ర దేశానికి చిరపరిచితులైన శ్రీ కొవ్వలి లక్ష్మీనరసింహారావుగారు రామరాజ్యం అనే సర్వోదయ సమాజాదర్శాన్ని దృష్టిలో పెట్టుకుని కథ వ్రాశారు. కష్టించి పనిచేసే వారికి న్యాయమైన ప్రతిఫలం ముట్టినప్పుడు కాని సమాజంలో శాంతి ఏర్పడదని చూపడం కథకుల లక్ష్యం. కథారచనలో కొవ్వలి వారి ప్రత్యేకత కనపడుతుంది. వివిధ సన్నివేశాలూ, నృత్యాలూ (టాప్ డాన్స్ కూడా), కార్మిక కర్షకగీతాలూ మిల్లులు, క్వారీలదృశ్యాలూ పేదలకష్టాలదృశ్యాలూ, నేరపరిశోధన మొదలైనవి ప్రేక్షకుల నాకర్షించ గలిగేవి ఈచిత్రంలో చాలా ఉన్నాయి.

ఎస్టేటులో రైతుల్ని, తన బట్టలమిల్లులో కార్మికుల్ని పెట్టుబడిదారు మాంధాత (డా॥గోవిందరాజుల సుబ్బారావు) పీడించి లాభాలు గుంజుకుంటూ నిర్దాక్షిణ్యంగా ప్రవర్తిస్తున్న దృశ్యాలతో ఆరంభమౌతుంది చిత్రం. ఇతనికి మూడో పెళ్లి పెళ్లాం మంజరి (సావిత్రి) నేతిబీరకాయవంటి ఒక పత్రికా సంపాదకుడు 'టాంటాం' (పేకేటి శివరామ్) తోడై కర్షక కార్మికుల్ని షష్టిపూర్తి ఉత్సవమనీ, అదనీ ఇదనీ మరింత పీడిస్తారు. చెల్లెలు (హేమలత), మేనగోడలు శుభ (చంద్రకుమారి) కటిక దారిద్ర్యం అనుభవిస్తున్నా పడుచుపెళ్లానికి విధేయుడైన మాంధాత సహాయం చెయ్యడు.

ఈ పరిస్థితిలో కరుణకుమార్ (రామచంద్ర కాశ్యప) అనే జమీందారు రంగంలోకి దిగుతాడు. తన తండ్రి సద్గుణవంతు



వినోదావారి 'శాంతి'లో ఒక ఘట్టం—కాశ్యప్, డాక్టర్ సుబ్బారావు, పేకేటి, సావిత్రి.

కైనప్పటికీ మాంధాత రాంధాతలనే దుష్టుల దుస్సహవాసానికి లోబడి ఎస్టేటు దివాలా తీయించాడనీ చివరికి ఆత్మహత్య చేసుకున్నాడనీ విని ఆదుష్టులజాడ తియ్యడానికి కరుణకుమార్ వస్తాడు. వచ్చి అక్కడ సమ్మె చేస్తున్న కర్షకులకూ కార్మికులకూ నోట్లకట్టలు దానం చేసి తన పని నెరవేర్చుకుంటాడు. పనిలోపనిగా మాంధాత శాలికి సహాయం చేస్తూ, శుభను పెళ్లిచేసుకోడానికి నిర్ణయించుకుంటాడు కూడా. మారువేషం వేసుకుని మాంధాత ఇంట్లో నౌకరుగా కుదిరి కూపీ తీస్తాడు. మాంధాత రాంధాత అనే అతనితో కలిసి తన తండ్రిని హత్య చేసి ధనం దోచుకున్నట్లు తెలుసుకుంటాడు. దోచుకున్న దానిలో తన వాటా తనకి ఇవ్వకపోతే గుట్టు బైట పెడతానని బెదిరిస్తూ రాంధాత మాంధాతకి రాసిన ఉత్తరాన్ని కరుణకుమార్ చూస్తాడు. ఆ సమయంలోనే మాంధాత వచ్చి అతన్ని పట్టుకుంటాడు. పట్టుకుని అతన్నీ శుభనూ స్తంభాలకు కట్టి హింసిస్తున్న సమయంలో కార్మికులూ పోలీసులూ వస్తారు. దుష్టులిద్దరికీ మరణశిక్షు, మంజరికీ, పత్రికా సంపాదకునికీ ఖైదూ విధించబడతాయి. జమీందారు కరుణకుమార్ తన ఎస్టేట్‌ని కర్షకులందరికీ పంచి ఇచ్చి, శుభను పెళ్ళి చేసుకుని తనుకూడా కర్షకుడౌతాడు.

చిత్రం మొదటినుంచి తుదివరకూ (అక్కడక్కడ కొన్ని సన్నివేశాలలో తప్ప) ఒకే స్థాయిలో నడుస్తుంది. కథాగమనానికి దర్శకుడు మరికొంత తోడ్పడి ఉండవలసిందనిపిస్తుంది. ఇందుకు అవ్యవధి హేతువై ఉండవచ్చు. మధ్య మధ్య హాస్య సంభాషణలు, డా॥ సుబ్బారావుగారి సహజనటనా కౌశలం, కాశ్యప గంభీరభావమూ చిత్రాన్ని రక్తికట్టిస్తాయి. ★



మిల్లుకూలీలు నాటకనూడి పరాభవిస్తే ఏంచెయ్యాలో తోచక దిగాలుపడి కూర్చుండిపోయారు, టాం టాం, మాంధాతాలు—, వినోదావారి "శాంతి"లో పేకేటి శివరాం, డా॥ గోవిందరాజులసుబ్బారావు.



వినోదావారి "శాంతి"లో
చంద్రకుమారి,

భరణీవారి 'ప్రేమ'లో భానుమతి, నాగేశ్వరరావు

కూతురు మెళ్ళో తాళి తెంపిన ఘనుడికి విజయావారు 'పెళ్ళి చేసి చూడు'లో బుద్ధిగరుపుతున్నారు

## తత్త్వమసి

(౫-వ పేజి తరువాయి)

పార్కులో గడియారం ఆరుగంటలు కొట్టడం వినిపించింది. ఇంకా చీకటిగానే ఉంది, ఆరయిందా? అనుకుంటూ ప్రక్క వాటావాళ్ళ గడియారం కిటికీలోంచి తొంగిచూశాడు. ముప్పావుగంట తక్కువగా ఉంది. వాచర్ కోసం తప్పుటైం చూపించడం నేర్చుకున్న గడియారం బహిరంగంగా అందరికీ తప్పుటైం చూపించడం నేర్చుకుంది. ఎంత తప్పుటైం చూపించినా అది గడియారమే. గడియారాన్ని తిడుతూనే అది గడియారం తప్పుకాదని ముకుందరావు నమ్మాడు.

సాయంత్రం పార్కులో గోపాలం కలిశాడు. గోపాలంతో సరిగ్గామాట్లాడకుండా ముకుందరావు తప్పుటైం చూపిస్తున్న గడియారంముళ్ళవంక చూస్తూ కూచున్నాడు. 'ఏమిటాలోచిస్తున్నావు, ఆ గడియారం తప్పు తిరుగుతూ ఉంటుందిరా' అన్నాడు గోపాలం.

'మన వేదాంతులు తత్త్వమసి అన్నారు.. నిజమే'

ముకుందరావు అన్నది గోపాలానికి కొత్తగా తోచింది.

'తత్త్వమసి. అదీ నువ్వూ ఒక్కటే నంటోంది నా మనస్సుకూడా' అన్నాడు మళ్ళీ ముకుందరావు పార్కు గడియారం వంక చూస్తూనే.

గోపాలంమాత్రం 'యిట్లా చాలా గడియారాలు పాడైపోతున్నాయిలేరా' అని ఏదో మాటాడబోయాడు. ★





పీపుల్స్‌వారి 'పల్లెటూరు'లో చంద్రం (ఎన్. టి. రామారావు) శాబోయే మామ సాంబయ్య (కోడూరు అచ్చయ్య)తో సరాగాలాడుతూ గూడ వేస్తున్నాడు

మహాబూబ్ నిర్మిస్తున్న రంగు రంగులచిత్రం 'ఆన్'లో నిమ్మి



అంజలీ పిక్చర్సవారి 'పరదేశి'లో కొత్తజంట టి. డి వసంత, గణేశన్



చలన-చిత్ర ప్రదర్శనానికి అమెరికా పంపిన పారమౌంట్ ఫిల్మ్‌వారి ఇంగ్లీషు చిత్రం *'Anything Can Happen'* లో కిమ్ హంటర్, జోస్ ఫెరార్.

చలన-చిత్ర ప్రదర్శనానికి ఇటలీపంపిన అర్క్స్ ఫిల్మ్ ఇటాలియన్ చిత్రం *The Sky on the Manshes* లో ఒక దృశ్యం

చలనచిత్ర ప్రదర్శనానికి ఇటలీపంపిన లక్స్‌ఫిల్మ్‌వారి ఇటాలియన్ చిత్రం *Road To Hope* లో ఒక దృశ్యం.



ప్రపంచ చలనచిత్ర మహోత్సవాలకు మద్రాసు ప్రధాన న్యాయమూర్తి పి. రాజమన్నార్ ప్రారంభోత్సవం చేశారు. చిత్రంలో ప్రసంగించుచున్నవారు ఆహ్వాన సంఘాధ్యక్షులు సి. యమ్. అగర్ వాలా.



ప్రపంచ బ్యాంకు అధ్యక్షులు యూజిన్ ఆర్. బ్లాక్ దంపతులకు ఢిల్లీ విమాన కేంద్రంలో స్వాగతం:



ఢిల్లీలో శ్రీ స్వామి సీతారాం, ఆయన అనుయాయులు



ప్రపంచ బ్యాంకు అధ్యక్షులు యూజినీ ఆర్. బ్లాక్, ఆయన సతి, భారత రిపబ్లిక్ అధ్యక్షులు శ్రీ రాజేంద్రప్రసాద్‌ను సందర్శించారు.

# పీడకల

(7-వ పేజీ తరువాయి)

(యువకులు కొన్ని వందలమంది ఉద్రేకంగా పాడుతూ వస్తారు.)

మరో ప్రపంచం
మరో ప్రపంచం
మరో ప్రపంచం పిలిచింది
పదండి ముందుకి
పదండి తోసుకు
పదండి పోదాం పైపైకి
కనపడలేదా మరో ప్రపంచపు...

శెట్టి : ఏమిటా గోల ?

యువకులు : గోలకాదు పాట

శెట్టి : మీ మొహం. లయాలేదు శృతీ లేదు. అదేపాట ?

యువ : దీనికి యువకుల హృదయాలే తాళం వేస్తాయి. వాళ్ళ ఉద్రేకరక్త నాళాలే శృతి కలిపి పాడతాయి.

శెట్టి : అర్థంలేని మాటలు. చాలాసార్లు విన్నాను. ఎవరు మీరు? నాతో ఏంపని?

యువ : మేము ఆదర్శప్రభుత్వపు సైనికులం. నీకు ఆ పాటకి అర్థం చెప్పడానికి వచ్చేం.

శెట్టి : కాగితం, కలం వున్నాయా ?

యువ : ఆ పాటకి అర్థం చెప్పడానికి కాగితం కలం చాలవు.

శెట్టి : మరి ?

యువ : (ఏకకంఠంగా)

ఎముకలు కుళ్లిన
వయస్సు మళ్లిన
సోమరులారా చావండి.

ఈ పాట అర్థం కావాలంటే నువ్వు చావాలి. నిన్ను ఉరితీస్తాం.

శెట్టి : మర్యాదగా మాట్లాడండి. నే నెవర్నీ ఖూనీ చెయ్యలేదు.

యువ : ఖూనీ చేసినా బాగుండేది. ప్రాణం ఒక్కసారి పోతుంది. నువ్వు వాళ్ళ నోటిదగ్గర తిండి లాక్కున్నావు. ఒక్కొక్క ప్రాణమే తీసి క్రమక్రమంగా చంపేవు. ఒక్కర్నీ ఇద్దర్నీ కాదు. కొన్ని వేలమందిని. నీ మూలకంగానే దేశం నిర్వీర్యమైపోతోంది. యువకులకి కడుపునిండా తిండి లేదు. దేశం నాశనమైపోతోంది. జాతి పతనం చెందుతోంది. నువ్వు జాతిని హత్య చేస్తున్నావు. (శెట్టిని పట్టుకొంటారు)

శెట్టి : అబద్ధం. అబద్ధం. నే నెవర్నీ చంపలేదు. ఎవడో లంచం పుచ్చుకొని అబద్ధం సాక్ష్యం చెప్పేడు.

(యువకులంతా శెట్టిని దూలానికి కట్టి ఉరితీస్తారు.)

శెట్టి : ఘోరం. ఘోరం. నా మెడ బిగుసుకుపోతోంది. అబ్బ! అబ్బ! ఆ!! ఆ!! ఆ!!

(మంచంమీదనుండి శెట్టి దబాల్న లేస్తాడు. కల చెదిరింది. స్థలం శెట్టిగారి రమ్యహర్మ్యం. కాలం తెల్లవారు ఝాను నాలుగు గంటలు)

శెట్టి : (నాలుగువైపులా చూసి మెడ తడువుకొని) అంతా ఉత్తదే. ఒట్టి కల. పీడకల !

(అటించి ఇటు తిరిగిఒత్తిగిల్లి పడుకొంటాడు.)





Edited, Printed & Published by S. Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St., Madras

సీలుఆన్సరు మడతను ప్రీమియర్‌బాన్కుకీలో

బహుమతి రూ 10,000

MURALI CROSS WORDS

మురళి 1, 2, క్రాసువర్డ్సు

GOVT REGD NO 1894

ముగింపుతేది

7-3-52

వరుస 1కి నాలుగు అణాలు

మొదటి బహుమతి రూ. 7000

MURALI

ఇతర బహుమతి రూ. 3,000

## Closing Date 7-3-52 (Subject to Rules and Conditions.)

| | | జవాబులు 1 | 2 |
|---|---|---|---|
| 1 | మాయొక్క మురళి క్రాసువర్డ్సు పోటిలలో ప్రతి పర్యాయము విశేషమైన ఇవి కొననగును | వింతలు | పుంతలు |
| 2 | జీవితములో ఇది లేనివారు వృద్ధికివచ్చుట తక్కువ | నియమము | నిగ్రహము |
| 3 | ఇట్టి వ్యక్తితో వాదించి ప్రయోజనములేదు | ప్రాజ్ఞుడు | మూర్ఖుడు |
| 4 | ఇది కొరతపడినగృహంలో ఆనందమే వుండదని చెప్పాలి | రూపాయి | పాపాయి |
| 5 | కొంతమంది ప్రేమకలాపం ఇలాపరిణమించవచ్చును | గాథ | బాధ |
| 6 | భర్త ఇలాంటివాడైన పక్షంలో భార్య వక్రమార్గం అవలంబించుటకు అవకాశముంటుంది | వేశ్యాలోలుడు | భార్యాలోలుడు |
| 7 | దీనిని చూచేసమయములో ఒకొక్కప్పుడు నిజమా కాదా అనే భ్రమ కలుగుతుంది | కౌటకము | నాటకము |
| 8 | ఇదిలేని వ్యక్తికి సమాజములో గౌరవముతక్కువ | విత్తము | విద్య |
| 9 | యెవరి దీనినైనా అవహేళనచేయడం తగాదా తెచ్చుకొనడమే | ఊరు | పేరు |
| 10 | యేయొక్క విషయమున్ను కొందరు———తోనే పూనుదురు | ఆదాయము | ఆదారము |
| 11 | వెలపడతికి————నందు మక్కువ | నాణెము | నాట్యము |
| 12 | ప్రబల న్యాయాదిపతి దీని అనుసరించియే తీర్పు ముగించును | రీతి | నీతి |
| 13 | ఇది పూనిన వ్యక్తి జాగ్రత్తగా వ్యవహరించాలి | దీక్ష | కక్ష |

మీ జవాబులు ఈ ఇండ్లయందు 1. 2 మూలముగాపూర్తి చేయుడు

| | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| 1 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 2 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 3 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 4 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 5 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 6 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 7 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 8 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 9 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 10 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 11 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 12 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |
| 13 | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | | |

పైనుండికిందవరకు జవాబులవరుస 1కి 4 అణాలుమాత్రం రూపాయికి 5 వరుసలు పూర్తిచేయుడు

3 తప్పులున్నను బహుమతి కలదు.

ఈ 7వ పోటీయందు అన్ని బహుమతులు కలవు.

ఐదరుమందికి ఒకటే ప్రత్యేకం.

పేరు.........................................

అడ్రసు.........................................

P. O. or M. O. No.........Col No .........మొత్తము రూ..

In entering the Competition I agree to abide by the Competition Rules & Conditions and to accept the Competition Manager's decision as final and legally binding.

**No. 7**

| | Rs. | As. |
|---|---|---|
| మొత్తము రూపా. | | |
| మొత్తము వరుసలు | | |

*Address Entries to*: **MURALI CROSSWORDS, PALMANER.** (CHITTOOR DIST.)

Regd No M 4479




డిస్ట్రిబ్యూటర్లు :— ఆంధ్ర :- గోకుల్ కృష్ణా, విజయవాడ. నైజాం :- ప్రీమియర్, సికింద్రాబాద్.
సీడెడ్ :- శాంతి, గుంతకల్లు. మైసూరు : జయంత్, బెంగుళూరు.